Reg. No. 757.

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

---


సంపుటము 13 } 1921 సం॥ మార్చి { సంచికలు 3


---

విషయములు



చందానిర్ణయము

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు [illegible] 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0


చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరిస్వాములవారు.

2 శ్రీ శ్రీ రాజా గద్వాలసంస్థానాధీశ్వర సీతారామ భూపాల బలవంత్ బహద్దరువారు, గద్వాలసంస్థానము.

## పోషకులు.

1 రామసింగుగారు, నెల్లూర్లు పాపురపు సంస్థానము మేనేజరు, నెల్లూరు.
2 రాయవరపు గవర్రాజుగారు, మూలపేట.
3 కొత్తా సూర్యనారాయణరావుగారు, మర్చెంటు, బెజవాడ.
4 జాగర్లమూడి కుప్పస్వామి నాయుడుగారు, కారంచేడు.
5 అల్లాడి లక్ష్మణరావుగారు, కరణం, జంగపల్లి.
6 రంగావఝ్ఝుల హనుమయ్యగారు, జిల్లాకోర్టు వకీలు, నర్సారావుపేట.
7 గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మాసెకొండూరు.
8 కంమ్మకూరు లక్ష్మీప్రసాదరావు బహద్దూరు జమీందారుగారు, ఊర్లాం.

## సహాయులు.

1 పట్వారి నారాయణరావుగారు, క్షీరసాగరము.
2 [illegible] కృష్ణయ్యగారు, మర్చెంటు, బెజవాడ.
3 జాలూరి వెంకటరత్నంగారు, వకీలు, గుంటూరు.
4 తమ్మన రామకృష్ణయ్యగారు, మర్చెంటు, బందరు.
5 వెలమకన్ని శోభనాద్రిరావుగారు, అడ్లూరు సివారు.
6 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజఱ్ఱంపాడు.
7 నెల్లూరి కేశవరావు దేశముఖుగారు, నెల్లూరు.
8 వావిళ్ల వెంకటేశశాస్త్రిగారు, చెన్నపట్టణం.
9 పంచాయతి స[illegible] పిడుగురాళ్ల.
10 ఏలేశ్వరం [illegible]లు, మర్చెంటు, బెజవాడ.
11 ఎనమండ్ర ల[illegible]ంగారు, మర్చెంటు, బెజవాడ.
12 పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు, బెజవాడ.
13 తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల.
14 పిల్లలమర్రి సోమయాజులుగారు, తహసీలుదారు, ఒంగోలు.
15 కావుమూను హనుమయ్యగారు, నర్సారావుపేట.
16 రాచకొండ వెంకటరామయ్యగారు, మర్చెంటు, వినుకొండ.
17 మొదటు శివజీరావు దేశముఖుగారు, నల్లబల్లి.
18 రావిప్రోలు రాఘవదీక్షితులుగారు, కారుమూరు.
19 గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబుయిన్‌స్పెక్టరు, తాడేపల్లి
20 నారపరాజు వెంకటలక్ష్మీనరసింహారావు దేశముఖుగారు, తమ్మవరం.
దేమె రాజారాంబావగారు ఇనాందారు, దోనకొండ.

# అభినవసరస్వతి

సంపుటము ౧౩ { జానపాదు, రౌద్రి సం॥ ఫాల్గుణ మాసము, దుర్మతి సం॥ చైత్ర మాసము. } సంచికలు 3, ౪.


## కృతివిమర్శనము.

**పసిపాప**—ఇది బాపట్ల స్కూలిమాష్టారగు భువనగిరి కోదండపాణి గారిచే వ్రాసి ప్రచురింపఁబడినగ్రంథము. పసిపాపఁడైన యాతనికొమరుఁడు పరలోకగతుండగుటయుఁ దలిదండ్రులు లబ్బాలునిగూర్చి చేసిన విలాపమే యింతగ్రంథంబయ్యెను. ఈదంపతులు పది యేండ్లు కాన్పులుగాంచి తుదకు నలుగురుబిడ్డలనే చూచుటకునోచుకొనినతలిదండ్రులం. కనుకనే వారిపరిదేవన మింతగ్రంథము కావలసివచ్చెను. దంపతులిరువురును దుఃఖమును బంచుకొని యనుభవించుచున్నంతకాల మెటులనో సైచినను దుద కీకోదండపాణిగారు పుత్రదుఃఖముతో పాటు కళత్రదుఃఖమును కూడ ననుభవింపవచ్చె. దాని నే పుస్తక రూపమున వెలువరించు కోరికను భరింపలేకపోయెను. వచ్చిపోయినగేడ పగిలిపోయినబుడ్డను పోల్చెడినన్న ప్రసంగముతోఁ దుల్యమై యీప్రయత్నము ఫలశూన్యమేయైనను బ్రదుకనిబిడ్డ బాలుఁడన్నటు లీడునకు మించిన తెలివితేటలు గల యాకుఱ్ఱఁడే యిట్లు చేయించెను. ఇది క్రౌను సైజున 80పుటలగ్రంథము. కవిత్వము మృదుమధురపద గుంభితమై ముద్దులొలుకుచుండును. ప్రారంభమునుండి మొదలుపెట్టి 500 చరణములపర్యంతము నడపఁబడిన యుత్పలమాలికయే యీయనకవితా ప్రాశస్త్యమును వేనోళ్లఁ జాటెడిని గాన నందలి కొన్ని చరణముల నుదాహరించి యింతటితో విరమించుచున్నాము. ఈగ్రంథము వలయువారు గుంటూరు జిల్లా కోర్టుప్లీడరులగు గుండు సూర్యానంత నరహరిరావు బిఏబిఎల్ గారికేర వ్రాసికొనవలెను

తాపసులైన సాధువులతాలిమి తూలఁగఁ జేసి యుంటినో
పాప మనంగఁ బోక పసపం గసుకందులఁ ద్రుంచియుంటినో
పాపలఁ దల్లిదండ్రు లెడఁ బాయుననటు ల్వెతగూర్చియుంటినో
రోఁగపనివారి యూపిరికి నోపని రోపని దార్చియుంటినో
సాపడఁ బోవువారికిఁ బ్రిశాదము సావలఁ ద్రోసియుంటినో

తాపము చెందనీకు; సతతంబును దోడయి సౌఖ్యమిమ్ము; రా
మా! పరితాపమొందితిఁ జామా! శరణంటిఁ జామా! దయానిధీ!

## —* భారతదేశపుఁ బ్రస్తుతస్థితి. *—

మాఘమాసపత్రికయందు భారతభూమియొక్క పూర్వస్థితి ప్రకటించియుంటిమి. ఈమాసంబునఁ బ్రస్తుతస్థితి దెలుపుచున్నవారము. పూర్వస్థితిలోఁ జతుర్యుగములయందును మహావైభవములోనుండి కలియుగమునఁ గొంతకాలమున కీభారతభూమి తురుష్కపాలితమయి పడపడి రెడ్లయేలుబడికివచ్చునంతవఱకును దెలియఁబఱచితిమి. అట్టిది యన వేమారెడ్డి మొదలగు ననేకరాజన్యులచేఁ బాల్యమానయగుచు రానురా నిప్పటికించుమించు 300 ల సంవత్సరములక్రింద నింగ్లాండునుండి వాణిజ్యార్థమై యిందరుదెంచిన యాంగ్లేయులకుఁ గైవసమయ్యెను. వాస్తవమున కవ్వార లీదేశమునకువచ్చుట రాజ్యకాంక్షచేఁ గాకున్నను యుగానుసారముగా భారతమాత వారిచేతులఁ బడఁగలిగెను. అప్పటి కీదేశమున నిరంకుశప్రభు వొక్కండును లేక మండలనాథులుగా ననేకు లేర్పడియుండి పరస్పరము వివాదములాడుకొనుచుఁ దమవాశ్రయించిరే యచ్చటచ్చట విక్రయార్థద్వీపాంతరానీత వివిధవస్తుస్థాపనార్థమై విశాలభూప్రదేశముల నాక్రమించుకొని గృహనిర్మాణములఁ గావించుకొని స్వార్థగతుణచణమైన కొంతసైన్యములోఁగూడ శ్రీమంతులై తగుమర్యాదతో వర్తించు హూణవణిజులసహాయ మపేక్షించుచుండుటయు వార లొకరిపక్షమునఁజేరి మఱియొకరిమీఁదికి దండెత్తి జయించి ప్రతిఫలముగాఁ గొంతరాజ్యమును గ్రహించుచు నిట్లు క్రమక్రమముగా భారతదేశమంతయు నచిరకాలముననే తమయేలుబడికిఁ దెచ్చుకోఁగలిగిరి. అట్లెన్నియో దుండగములొనరించియు నెందఱికొంపలనో కూల్చియు హిందూదేశమంతయుఁ దమపాలనములోనికిఁ దెచ్చుకొనినది యింగ్లాండు నివాసముగాఁగల కంపెనీవారే యైనను వారల నేజంట్లుగానే యుంచి స్వాతంత్ర్యము దమయందయుంచుకొనుచుఁ గ్రమక్రమముగా, భారతీయులకుఁ గంపెనీవారి యెడలఁగలిగిన యనిష్టమును జక్కఁగా గుర్తెఱిఁగి యింగ్లాండునందలి మంత్రివర్గమువారు తుద కిప్పటికించుమించు 60 వత్సరముల నాఁడిండియాను శ్రీవిక్టోరియావశము గావించిరి.

ఆమహారాజ్ఞి పూర్వరాజులుంబోలె హిందూదేశమునకు సకలసౌఖ్యముల నొదఁగూర్చి ధర్మపరిపాలన మొనర్చినదనుటకు సంశయములేదు. మధ్యఁగోల్పోయిన నాగరి

బాధింప మొదలిడిరి. ప్రభువు లవ్వాని బుట్టదాఖలు చేయుచు వచ్చిరి. రానురా నధికారివర్గము వారదయులు కాఁజొచ్చిరి. ఉన్నతవిద్యాపఠనము బీదలకు దుస్సాధ్యముగాఁ జేయఁబూనిరి. పరీక్షితులైన పాఠకులలోఁ బ్యాసగువారిసంఖ్య తఱుఁ దగ్గసాగెను. ఈయాకారణములచేఁ బ్రజలకుఁ బ్రభువులయెడలఁగలిగిన విశ్వాసము క్రమముగా క్షీణింపజొచ్చెను. ఇట్లుండ ఇంగ్లీషువారకు జర్మనులతోడి సంగ్రామము సంప్రాప్తంబయ్యె. అట్టిపట్ల నవ్వారికి సేనలసాహాయ్య మత్యావశ్యకంబైనది. అందుకొఱకు హైందవులఁగూడ నర్థించిరి.

మనవారు శక్తివంచనలేకుండఁ దమ యుద్ధసహాయకార్యముం గావించి ప్రభుభక్తిని వెల్లడించిరి; జయము చేకూర్చిరి. స్వాతంత్ర్య సంపాదనమునకు సమయ మిదియయని సంతోషసాగరంబున నోలలాడిరి. విల్సనుగారి స్వయంనిర్ణయసూత్రము వీరి సంతోషసాగరమునకు విధూదయప్రాయమై వృద్ధినిబొందింపసాగెను. నూతనాశలను లంకురింపజేసె. ఇదివఱకుఁ బ్రసాదింపఁబడిన సంస్కరణములవలనఁ దృప్తిఁబొందక యభినవాధికారముల కాశింప మొదలిడిరి. సింహాప్రభృతుల ప్రేరణచేఁ బ్రభుత్వమువారు హిందూదేశమునకు స్వరాజ్యము నిచ్చెద [illegible] ప్రకటనములుగూడఁ జేసికొనఁజొచ్చిరి. దేశీయసభలయందు శాసననిర్మాణసభలలోఁ బ్రజాప్రతినిధు లెక్కువమందియుండి యధికారివర్గముపైఁ బూర్ణాధికారము గలిగియుండవలెనని తీర్మానించుకొనఁగలిగిరి. మధ్య మాంటాగ్యూగారు ప్రవేశించి మనవారి మనోరథములను మఱింత పెంపుచేసిరి, తదనుగుణముగా సార్వభౌములును ననుకూలసంస్కరణములు గావింతుమని వాగ్దానమొనరించుచు నమృతసరములో సమావేశమైన జాతీయసభదినమున నాకనిర్బంధితుల విడిచిపెట్టుటమూలమున దానిని వ్యక్తీకరించికూడ నుండిరి. కాని వాగ్దానరించిన సంస్కరణములు భారతీయులకు సంతృప్తికరములు కాకపోయెను. అనుకొన్నంత యర్థవంతములు కాకపోయెను. అటుపైఁ గ్రమక్రమముగాఁ బ్రజలయభిప్రాయములు మాఱఁదొడంగెను. అట్టి ప్రజాభిప్రాయములను బంజాబుదురంతములువచ్చి ప్రవృద్ధమొనరించె.

భారతదేశమునఁ బలుమంది రాజద్రోహులు ప్రబలిరనియుఁ దమ రాజ్యమునకుఁ బ్రమాదము గలిగింతురనియు నిర్నిమిత్తముగా భీతిల్లి [illegible]విధానమున నిదివఱకున్న శాసనములు చాలవని రౌలటుచట్టమనునొకటి సృష్టించిరి. ఆచట్టము ప్రకారము [illegible] హైందవుల న్యాయము [illegible] కోలాహల మొనరింపబడి కాని [illegible]

మంతయు లేక యది ప్యాసుకానే యైనది. అందుమీఁదనే గాంధిగారు సత్యాగ్రహవ్రత మవలంబించుట. సత్యాగ్రహవ్రతమనఁగాఁ బ్రహ్లాదవృత్తి. గాంధిగారి గమ్యస్థానము స్వరాజ్యము. ప్రహ్లాదుని గమ్యస్థానము హరిపదము. హరిని స్మరింపవలదని యతని నతఁడనేకవిధములబాధించెను. పెట్టినబాధలన్నియు ననుభవించెనే కాని పట్టినపట్టునుమాత్రము ప్రహ్లాదుఁడు విడిచినవాఁడు కాఁడు. ప్రతిహూణుఁడైన హిరణ్యకశిపునిపై దౌర్జన్యమును గనఁబఱుపఁడు. ధ్యేయమైనపదార్థమునుమాత్రము ధ్యానము సేయుచుఁ దుదకు గమ్యస్థానమునకుఁ జేరఁగలిగెను. గాంధిమహాత్ముఁడును శమదమాదిసుగుణముల కునికిపట్టై పట్టినపట్టువీడక పనిచేయుచున్నవాఁడు. కావునఁ బ్రహ్లాదుఁడుంబోలె గమ్యస్థానమునకుఁ జేరఁగలఁడని చెప్పవచ్చును. అందులకుఁ బ్రథమము కైరాజిల్లాలో జరిపిన చరిత్రమే ప్రబలనిదర్శనము. మహాత్మునియుద్దేశ మింత సాత్వికప్రధానమై సంస్తువనీయమగుచున్నను మూర్ఖులగు మధ్యవర్తులమూలమునఁ గలవరము హెచ్చెను వా రావేశపూరితులై కొన్ని దుండగములు గావించిరి. అవి యెవరిమూలముగ జరిగినదియు నిశ్చయ మెఱుఁగలేక ప్రభువు లెఱుకకొఱ కింటికిఁ జిచ్చుపెట్టినలాగునఁ బ్రజాసామాన్యమునుబట్టి బహువిధబాధలకు లోనుగా [illegible] మూలనున్న ముసిలమ్మను గత్తిదూసిపొడిచిన కుంటునికథను జ్ఞప్తికిం దెచ్చిరి. ఒకవేళఁ బురుషుల పెట్టిబాధలపాలు చేసినను స్త్రీలయెడల నార్ద్రహృదయులై యుండవలసిన దానికిమాఱుగాఁ బాంచాలమునఁబఱుమందిని బరాభవించి భారతీయుల కోపానలమును బ్రజ్వలింపఁజేసిరి. భారతీయులకును మహమ్మదీయులకును గావలసినంత భేదభావము గలిగియున్నను జర్మనులతోడి సంగ్రామమున నొసంగిన యభయప్రదానముల నన్నిటిని నవలఁద్రోసి టర్కీకిఁ గలిగించిన యన్యాయముమూలమున మహమ్మదీయులును బ్రభువులయెడ నాగ్రహాపూరితులై భారతీయులలో వచ్చికలసిరి. అందఱును జేరి యసహాయోద్యమము నవలంబించిరి. అసహాయోద్యమమనఁగాఁ బ్రభువులకుఁ దమరు తోడ్పడకుండుట. ప్రభువులిచ్చుబిరుదుల గ్రహించుటయు వారిపాఠశాలలకుఁ బిల్లలం బంపుటయు వారిన్యాయస్థానములలో వ్యవహారములఁ బరిష్కరించుకొనుటయు న్యాయవాదులుగానుండుటయు వారిజీతములం దీసికొని కొలువుసేయుటయు వారిరాజ్యమునకగు వ్యయమంతయు మనమిచ్చు పన్నులమూలమున సమకూర్చుటయు వారికి భారతీయులుచేయు తోడ్పాటైయున్నయది. ఇట్టిసహాయముల జేయకుండుటయే సహాయనిరాకరణము. ఈసహాయనిరాకరణమార్గమునకు శాంతము సాధనములుగట్టి తత్కార్యముగా నెపుట్కటకు మహాత్ముఁడు

భారతీయులవందఱిం బురికొల్పుచున్నాఁడు. అందు రాజకీయ బిరుదములను జీతములేని రాజకీయోద్యోగములను బరిత్యజించుటయు న్యాయవాదులు న్యాయస్థానములలోఁ బని చేయక ప్రజాస్వామిక న్యాయస్థానము లేర్పఱచుటయు రాజకీయకలాపాఠశాలలకు బాలురఁ బంపక దేశీయకలాపాఠశాలల స్థాపించి వానిలోఁ జదివించుటయు నూత్న శాసనసభలలోఁ బ్రవేశింపకుండుటయుఁ స్వరాజ్యప్రాసాదమునకుఁ బ్రథమసోపానములుగా నిర్మించినాఁడు. ఈ యీపనులు నిర్వహించుట మూలమున ఏతత్సోపానాధిరోహణము చేయునంతకు స్వరాజ్యమును సర్కారువారే ప్రసాదించిన ద్వితీయ సోపానాధిరోహణ మనవసరమే కాని యట్లు వొసఁగనిచో నదియు నిర్వహణీయము. జీతము తీసికొని నిర్వహించుచున్న రాజకీయోద్యోగములఁ బరిత్యజించుటయు ద్వితీయ సోపానము. పోలీసువారును సైనికులును దమకర్తవ్యమును మానికొనుట తృతీయ సోపానము. పన్నులను జెల్లింపకుండుట చతుర్థ సోపానము. మహాత్ముఁడు ప్రారంభించిన స్వరాజ్యప్రాసాద సమారోహణ కార్యమునకు భారతీయులు పలుమంది యంగీకరించిరే యున్న... రాజకీయ కలాపాఠశాలలనదలిన బాలురను బలవంతపెట్టి మరలఁ బంపుచునే యుందురు. వీనికేమిగాని సర్వసులభమైన పనిస... సులు పలేకయుండిరి. అప్పని విదేశీయ వస్త్రముల ధరింపకుండుటయు పూర్వము రూపాయికిచ్చెడిగుడ్డ యిప్పుడు నాల్గురూపాయల కిచ్చుచున్నారు.

పశ్చిమవాఁడును నాగరికత నభిలషించినవాఁడై విదేశీయవసనముల ధరింప మొదలిడిన తరువాతనే వీనికి వెలగూడ హెచ్చింప మొదలిడిరి- మనదేశమునఁ గష్టపడి పండించుకొన్న ప్రత్తియంతయు విదేశములకుఁ బంపి విదేశవస్త్రముల మన మధికమూల్యమునకుఁ గొని ధరించుటకన్న నవ్యమైన వెఱ్ఱితన మేమున్నది- ఇదియంతయుఁ గనిపెట్టి వెక్కండ్రు విదేశవస్తుబహిష్కారమును జేయఁబూనుటయెంతయు సంతోషకరము. ఇందులకై కొందఱు బుద్ధిమంతులు బయలుదేరి దేశసంచరణం బొనరించుచు బ్రజాసామాన్యమునకు బోధించుచుండుట మఱింత ప్రశంసనీయము. ప్రతిగ్రామమునను నీసహాయనిరాకరణోద్యమము ప్రబలినది- ప్రతిపట్టణమునను రాజకీయోద్యోగములసహితము కొందఱు వదలుకొనుచున్నారు. విద్యార్థులు పాఠశాలలు వదలుకొనుచున్నారు. కాని ప్రథమమున మానుకొని మరలఁ బ్రవేశించుటమాత్రము శోచనీయము. మొదలు మానుకొనునప్పుడే దూరాలోచన ముండవలెను. ప్రముఖులైనవా రూరూర నుపన్యాసములిచ్చి జనుల నీయుద్యమమునకుఁ బురికొల్పఁజూచుచున్నారు. కోడలు బిడ్డలఁగనుట యత్తకు ముదా

వహామైనట్టు లెట్టులేని మనవారు మనకు స్వరాజ్యము సంపాదించుట పరమానందసంధాయకమే కాని యొక్కఁడానికి మాత్రము విచారింపవలసియున్నది. మనవా రారోహింపఁబూనినది స్వరాజ్యప్రాసాదము. దానికి మహాత్ముఁడు కట్టిన మెట్టు లుండియే యున్నయవి. ఆమెట్టులు జాగ్రత్తమై నెక్కి గమ్యస్థానముఁ జేరుటకుఁ బ్రయత్నింపక యనవసరమైన మతచర్చ గూడ మధ్యమధ్యఁ జేయఁబూనుచున్న వారు.

---

## గాంధి మహాత్మాగమనము.

సత్యాగ్రహ వ్రతమూనఁబూని సహాయనిరాకరణమునకు జనులఁ బురికొల్పుచు స్వరాజ్యమును సంవత్సరములోపల సాధించుటకు గాంధిమహాత్ముఁడు ప్రతిజ్ఞచేసియున్నాఁడు. సంవత్సరములో నాలుమాసములు గడచినవి. ఇప్పటికిఁ బ్రథమసోపానము పైఁ బ్రజలు పలుసుంది పదములం బెట్టుచున్నవారు. అందఱిచేతను నన్ని సోపానములు నవరోహింపఁజేసి క్రమముగా స్వరాజ్యసుఖము [illegible] లెనని మహాత్మునియు[illegible] [illegible] బోధ చాలదని ప్రత్యక్షబోధకు బయలుదేరినాఁడు. ఆంధ్రదేశమునకరుదెంచినాఁడు. అలీసోదరులు లాలాలజపతిరాయి కేల్కారు సరళాదేవి చౌదరాణి విజయరాఘవాచార్యులు చిత్తరంజనదాసు మున్నగు ననేక దేశ నాయకులతోఁ బ్రథమము బెజవాడకుఁ బ్రవేశించినాఁడు ప్రవేశమునకుఁ బూర్వమే బెజవాడ ప్రజలచేఁ గిక్కిరిసి పోయినది. జనసంఖ్య వేలకుఁ గాదు లక్షలకుఁగాదు కోట్లకంటిపోయినది. ఆహ్వాన సంఘము వారఖిలవిధ సౌకర్యముల నొడగూర్చిరి. అత్యంతజన సంబాధవశంబున నవకాశసహితముగా నందఱును మహాత్ముని వాక్సుధా ధారలం గ్రోల వీలుగాకున్నను దర్శనవశంబుననే ధన్యులుగాఁ జాలిరి. తావన్మాత్రముననే జనసామాన్యమునకు సహాయనిరాకరణావేశమును స్వరాజ్యసంపాదనాతురతయు హెచ్చిపోయెను. సాంఘికోన్నతకలా పాఠశాలల జాతీయకళా పాఠశాలలుగా మార్పనాలోచనము చేయఁబూనిరి. వేయేల మహాత్ముఁడు స్వరాజ్యకార్యమునకుఁగాఁ గట్టిన ప్రథమసోపానమునందుఁ బెక్కండ్రు పదంబులను బాదుకొనియెను. స్వరాజ్యనిధికిఁ జాలద్రవ్యము సమర్పించిరి. విత్తవంతులు వేలరూపాయల నొసంగిరి. కృష్ణునకుఁ గుచేలుఁడువలె బీదలు సహితము పెక్కండ్రు శక్తివంచన లేకుండ స్వార్థత్యాగము గావించిరి. అంగనలాభరణంబులనే యర్పించిరి. అన్నివిధములచేతను నమ్మహాత్మునియెడల నఖిలజనులును గృతజ్ఞతను వెలిఁబుచ్చిరి.

అచ్చటినుండి కాకినాడ యేలూరు మున్నగు నగరంబుల కరిగి స్వరాజ్యనిధికిఁ జాల ద్రవ్యము ప్రోగుచేసికొని వందటిని ససహాయోద్యమమునకుఁ బురికొల్పియా మహాత్ముఁడు మా గుంటూరు మండలమునకు మరలెను. గుంటూరు పురంబంతయు గొప్ప యుత్సవమున కాస్పదమయ్యెను. వీధులన్నియు వివిధాలంకారములచే శోభిల్లెను. స్వరాజ్యము నేఁడే సంప్రాప్తించినటులఁ గానవయ్యెను. పట్టణంబంతయుఁ బందిళ్ళు. ఏకోటీశ్వరుని కార్యమునకైనను నింత వైభవము జరుగనేరదు. ఏచక్రవర్తి యరుదెంచినను నిందఱు జనులరుదెంచరు. బెజవాడలోనే పెక్కండ్రు మహాత్ముని సందర్శనము లభించినను మరల గుంటూరునకును గుంపులు గుంపులు రాఁగలిగిరి. రైళ్ళలో రవంతచోటు దొరకదయ్యె. మహాత్ముఁడు రాజధాని యంతయుఁ బరిభ్రమింపనెంచి పోవుచుండుటచే విశేషకాల మిందువసింపఁడయ్యె. అల్పకాలముననే యత్యంతానంద సంధాయకుఁడు కాఁజాలెను. ఈపురంబునఁగూడ ననేకు లత్యంతత్యాగశీలురై యాత్మసమర్పణకుఁగూడ నభ్యంతరము చేయరైరి. వైశ్యరత్నములును న్యాయవాదులును గొంతమంది సహస్రాధికరూప్యంబుల సమర్పించిరి. మహాత్ముండు మానినీమణి తోడను గుమారుల తోడను వచ్చియుండుటచే స్త్రీలు మహాత్ముని భార్యయెడలఁ బరమభక్తి యుదయించెను. ఆయమ స్త్రీసంఘములోనికి వచ్చినంతమాత్రముననే యంతమందలి యాభరణములనే చాలమంది సమర్పించిరి. ఎందఱెన్నియిచ్చిననేమి. స్వరాజ్యనిధికిఁ గోటిద్రవ్యము కూడవలెనని మహాత్ముని సంకల్పము. కూడకేమి. కోటిద్రవ్యముఁ గూడును. కోరిన కోర్కెయుఁ గొనసాగును. "సర్వంహి తపసాసాధ్యం" సర్వమును దపస్సుచే సాధితమగును. సదోపవాసరూపమైన సత్యాగ్రహవ్రతతపస్సు చేయుచు లోకోద్ధరణమునకై పాటుపడెడి స్వార్థత్యాగిచే నేది సాధింపఁబడదు. సర్వమును సమకూర్చి జగదీశ్వరుఁడు సపుత్రకళత్రుఁడైన మా గాంధిమహాత్ముని జిరాయుష్మంతుని జేయుఁగాక.

## — విశోధనము. —

ఇపుడీ బెజవాడ పురంబునజరిగిన మహాసభాసన్నివేశమును బోలునది యెన్నఁడు నీదేశమున జరిగియుండదని యనవచ్చును. ఒకవేళ నాంధ్రరాజుల యత్యున్నతదశలో ౨౦౦౦ వత్సరములక్రింద జరిగియుండునేమో కాని యిటీవల జరిగియుండదని చారిత్రవిదులుకూడ నంగీకరింపక తీరదు. ఏతత్సభాప్రముఖులందఱును బహుకళాకోవిదులు. స్వార్థమును తృణముగాఁ ద్యజించిన ధీరులు. భూతదయాపరులు. భారతవర్షదుస్స్థితి పరిహారార్థమై బద్ధకంకణులు. సమయోద్దేశము సాధించుటకు నానావిధక్లేశములు

సహించుటకును జివరకుఁ బ్రాణములనైన నర్పించుటకును సంసిద్ధులగు స్థిరచిత్తులు ఇట్టిలోకోపకారుల దర్శనమున మనమందఱము ధన్యులము. వీరిలో నాయకమణి యని చెప్పఁదగిన శ్రీగాంధిమహాత్ముఁడు సకల సద్గుణనిధి యను సంగతి జగద్విదితము వీరిజగదుద్ధరణోపాయములన్నియును శాంతరసప్రధానములు. అప్రతిహతములు. వీరు పాశ్చాత్య నాగరికత వలనను వారివిద్య వలనను వారి సామ్రాజ్యము వలనను భారతవర్షమునకు సంభవించిన కష్టనష్టములన్నిటిని బాగుగా విమర్శించి జనులకు స్వసామర్థ్యము వలననే స్వరాజ్యస్వాతంత్ర్యము లభించుట కుపాయముల బోధించిరి. కాన వీరి యుపదేశము లంగీకరింపఁదగినవి వీరు చెప్పినట్టుల వర్తించుట ముఖ్యకర్తవ్యము. వీరు మహమ్మదీయులకును హైందవులకును బరస్పరమైత్రిని సౌభ్రాత్రముతోఁ బరస్పర ధర్మముల సహించి వర్తిలుఁడని బోధించిరి పరమార్థమునకుఁ దమతమమతాచార్యులు చెప్పినట్లు నియమపూర్వకముగా వర్తించినను బరస్పరమైత్రిగలిగి యన్యోన్య సహాయము చేసికొనుచు వర్తించుట కభ్యంతర ముండదని వీరి యభిప్రాయము. వస్త్రనిర్మాణము మొదలగు స్వదేశ శిల్పముల నశింపఁ జేసికొని ద్వీపాంతములనుండి వస్త్రములఁ గొనుచు వారు [illegible] ధరల హెచ్చించినపుడు వస్త్రధారణాదుల కిష్టములఁ బడనేల యనియును వేన వేలు జనులు జీవించెడి పనిని నూఱ్వురితో నొక యంత్రాలయము నెఱవేర్చుచుండఁగా వేలకొలఁది జనులు కూలినాలి దొరకక క్షుత్పీడోపహతులై నశింపనేలయనియును రాటములఁ బ్రతియింటను వ్యాపింపఁ జేసితిరేని లోకమునకు వస్త్రదారిద్ర్యము నశించుననియుఁ దాన మహదారిద్ర్యము కొంత తగ్గుననియు బోధించిరి. ఇట్టిబోధనములు వారియుపన్యాసముల వలనను వారియంగిండియా పత్రికావ్యాసముల వలనను దెలియనగును. మఱియు వీరు స్పర్శదోషముకూడదనియు దాని నిరసింపవలెననియు బోధించిరి. వీరియుద్దేశము గ్రహింపక కొందఱు మందబుద్ధులు పంచములతోఁ గలసి భుజింపుచు వర్ణసంకరకారకులై జాత్యంతరస్థులతో సంబంధము సేయసమకట్టుచు నిదియంతయు గాంధిమహాత్ముని యుద్దేశమనినుడువుచున్నారు. ఇదిగొప్ప పొరపాటు "సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ" యను వాక్యముచే లోకగురువగు శ్రీకృష్ణుఁడు భగవద్గీతయందు వర్ణసంకరము నరకహేతువని బోధించెను. "శూద్రాన్నం సూతకాన్నంచ అభోజ్యస్యాన్నమేవచ, శంకితం ప్రతిషిద్ధాన్నం పూర్వోచ్ఛిష్టం తథైవచ, యది భుక్తంతు విప్రేణ అజ్ఞానా దాపదోపివా, జ్ఞాత్వా సమాచరే త్కృచ్ఛ్రం బ్రహ్మకూర్చనపావనం" అనుశ్లోకములచే శూద్రాన్నా

దికము బ్రాహ్మణుఁడు భుజింపఁగూడదని పరాశరస్మృతి ప్రాయశ్చిత్తకాండమునఁ
జెప్పఁబడినది. "యుగంయుగద్వయంచైవ త్రియుగంచ చతుష్టయం, చండాలసూతికోద
క్యాపతితానా మధఃక్రమాత్" అను పరాశరస్మృతి ప్రాయశ్చిత్త కాండశ్లోకమునసే
చండాలున కెనిమిదిగజముల యెడముగా బ్రాహ్మణుఁడుండవలెనని చెప్పఁబడియున్న
ది. శ్రు॥ తస్మాన్నజనమియాన్నాంతమియాన్నేత్స్వపాప్మాన మన్వవాయానీతి॥ యనుశుక్ల
యజుర్వేదములోని బృహదారణ్యకోపనిషత్తునందంత్యజనసంసర్గము కూడదని చెప్పఁబడి
యున్నది. "తస్మాత్తమంత్యంజనం నేయాత్ నగచ్ఛేత్ సంభాషణదర్శనాదిభిర్నసంస్పృ
శేత్ తత్సంసర్గేపాప్మనాసంసర్గకృతస్స్యాత్ పాప్మాశ్రయోహిసః" యని శ్రీశంకరభగవ
త్పాదాచార్యులవారు దానికి భాష్యము వ్రాసియున్నారు. ఇంచుమించుగా నిట్లనే
శ్రీరామానుజాచార్యుల వారును వ్రాసియున్నారు. ఇట్లు వేదములలోనను స్మృతులలో
నను వచనములున్నవి "శ్రుతిస్మృతీమమైవాజ్ఞే" యని భగవంతుఁడు చెప్పియున్నాఁడు గాన
సకల ధర్మములను గుణుతెలిఁగి ప్రాచీన సదాచారమును నెలకొల్పఁబూని పాశ్చా
త్య నవనాగరిక పద్ధతులు భారతీయులకుఁ గూడదని బోధించెడి ధర్మసంస్థాపకుఁడని చెప్పఁ
దగిన గాంధిమహాత్ముఁడు వర్ణసంకరము ... యొప్పకొనుబోధిం
చియుండఁడు. దేశోపద్రవము సంభవించునప్పుడు ధర్మశాస్త్రమును వీక్షింపకయే యం
దఱు నొక్కుమ్మడిఁ బాటుపడి దేశక్షేమము సంపాదించుకొనవలెననియు నొక్క గ్రామము
తగులఁబడుచుండ నన్ని వర్ణములవారును దగుసహాయము చేసి చల్లార్చినట్లే యిపుడు దేశము
గోల్పోయిన స్వాతంత్ర్యమును సంపాదించుట కందఱును వర్ణభేదములేక సహోదర
న్యాయముచే వర్తించవలయుననియు హైందవులలో నన్యోన్యయును హైందవ మహ
మ్మదీయులును బరమార్థ లాభమునకుఁ దమ తమ మత గ్రంథములను మతా
చార్యులును జెప్పినట్లుల వర్తించుచుఁ బరధర్మసహిష్ణుత్వముఁ బరస్పర స్నేహమును వృద్ధి
పఱచుకొనుచుఁ దమతమ ధర్మములనాచరించుచు దేశక్షేమమునకన్నదమ్ములంబోలివ
ర్తించవలెననియు స్పర్శదోషము కూడదను వీరిమాటకభిప్రాయము. వర్ణాశ్రమధర్మములా
చరించితీరవలెనని వారిదివఱకే యుపన్యసించియుండిరి. మహమ్మదీయులను మనసంఘము
లోఁ జేర్చుకొని బావులు మొదలగు వానిలో నీళ్లు దెచ్చుకొనుట కంగీకరించి గ్రామమధ్య
మున గృహములు కట్టుకొని నివసించుటకుఁ గూడ మన పూర్వికులు మొదలుకొని నేఁటివఱకును
మనమంగీకరించి యుండలేదా. అట్టిమహమ్మదీయులు పంచములనిరభ్యంతరముగాఁ దమ
లోఁ జేర్చుకొనెదరుకదా. అట్టిపంచములకు మనమేల మహమ్మదీయులకిచ్చిన యవకాశ
ముల నీయఁగూడదని కొందఱు శంకింపవచ్చును.

మహమ్మదీయులు దేశాంతరంబునుండి భరతఖండముపై దండెత్తివచ్చి శౌర్యధైర్యములచేఁబోరాడి జయముగాంచి పట్టణములలోనను పల్లెలలోనను సంఘమధ్యమున గృహములుకట్టినివసించి నప్పుడార్యులు శక్తిలోపముచేత విధిలేక దానినంగీకరించి యుండురు. అదిమొదలుకొని వత్సరములుగడచిన కొలఁది నది యాచారముగా నుదాహరింపఁబడుచున్నది. ధర్మశాస్త్రములందు మాత్రము మ్లేచ్ఛజనసంసర్గమును సహవాసమును పాపహేతువులనియే బోధింపఁబడి యున్నది, అట్టిసంసర్గములు గలిగినప్పుడు ప్రాయశ్చిత్తములును విధింపఁబడియున్నవి. ఇప్పుడైనను దొరతనము వారుగాని దేశనాయకులుగాని ధర్మశాస్త్రములఁ బరికింపక ధర్మరక్షణ తత్పరులగు శిష్టులమాటల సరకుగొనక పంచములఁ గ్రామ మధ్యముల నివసింపఁజేసి బావులు మొదలగు వానిలోసంబంధముగల్పించినయెడల నెవరేమి చేయఁగలరు? శ్లో॥ రాజారాష్ట్రస్యకారణం॥ ధర్మస్య రక్షితా రాజా॥ అనికదా శాస్త్రముకలదు. అట్లు ధర్మ సంకరముకలుగఁ జేసినందువలనఁ గలిగెడిపాతకమునకు వారుబాధ్యులై యుండఁగలరు. ఒకవేళజనులు గత్యంతరములేక యట్టిచండాల సంసర్గమున-కొడిగట్టికొన్నను నదిధర్మము కానేరదు. దానివలన దోషముఘటింపక మానదు. ధ[illegible] గ్రాహ్యములు కావు. కానమహమ్మదీయుల దృష్టాంతముచేఁ జండాల సంసర్గము కూడునని చెప్పుట యెంత మాత్రము సరియైనదికాదు. ఒకదోషమును దృష్టాంతముగా నిచ్చినంతమాత్రమున మఱియొకటి దోషముకాకపోవునా. ఇదిగాక సగరచక్రవర్తి గర్భమున నుండఁగా నతనితండ్రిని హైహయకాలకేయ రాజులు సంహరించి నట్టును నాసంగతిని యుక్తవస్సు వచ్చినయనంతరమున సగరుఁడు గ్రహించి పితృఘాతకులగు హైహయకాలకేయుల నిర్మూలముచేసెదనని ప్రతిజ్ఞఁబూనియనేకుల సంహరింపఁగా హతశేషులాతని గురువగు వసిష్ఠమహర్షి వద్ద కేకాంతమున వచ్చి "యీయన నిరపరాధులగు మమ్ములఁ జంపుచున్నవాఁడు మాకభయ మీయుఁడని ప్రార్థింపగా నాయన "సగరచక్రవర్తి ప్రతిజ్ఞను మానఁడు మీకుఁబ్రాణములందే తీపికలదేని కులభ్రష్టులై దేశాంతరగతులు కం"డనిబోధించెను.

అంతటవారలు శిరోముండనములఁ జేసికొని యజ్ఞోపవీతములఁ ద్రెంచుకొని గడ్డములఁ బెంచుకొని నానావిధవికృతవేషములతోఁ గులభ్రష్టులై దేశాంతరగతులై నట్లు విష్ణు పురాణమందొక కథగాన్పించుచున్నది. ఇందువలన దేశాంతరమునుండి వచ్చిన శిఖారహితులును లంబకూర్చులునునగు మహమ్మదీయులు శౌర్యధైర్యాది గుణములు గలవారలగుటచే క్షత్రబంధువులై యుండనోపుదురు. అట్టివారిసంసర్గమిప్పటి పంచమ

సంసర్గమంత పాపహేతువు కాకపోవచ్చును. ఆసంఘమునకు యవనులనియుఁ దురుష్కులనియు మొదటినుండియు నామములుగలవు. మహమ్మదనెడి మతాచార్యుని యనంతరము మహమ్మదీయులని వాడఁబడుచువచ్చిరి. ఎట్టులైనను నామహమ్మదీయులుగాని పంచములుగాని దేశక్షేమమునకై సోదరభావముచేఁ బాటుపడుటవలన దమలోఁదమకు వైరములుమాని పరలోక సాధనములగు తమ మతధర్మములను మతగ్రంథములను మతాచార్యులును జెప్పినట్లువర్తింపఁజేయుటకుఁగాని గాంధిమహాత్ముఁడు చెప్పిన నేయభ్యంతరమును లేదు. శ్రీశంకరాచార్యులు కాశీక్షేత్రమున సంచరించునపుడొక చండాలుఁడు కనుపింపఁగా నాతని దూరముగాఁ బొమ్మని యానతిచ్చెను అప్పుడాతఁడు తనయొక్క బ్రహ్మజ్ఞానసంపదను గొంతకనఁబఱుపఁగా నిట్టిజ్ఞాని యేకులపువాఁడైనను నాకు గురువుతో సమానుఁడని వారుకొన్ని శ్లోకములఁజెప్పిరి. ఇటులనేరామానుజాచార్యులును బ్రపన్నులగు కొందఱు జాత్యంతరస్థుల నాళ్వారులని గౌరవించినట్లు కూడఁగన్పట్టును. ఈకథల నాధారముగాఁ జేసికొని మతాచార్యులను చండాలసంసర్గము నంగీకరించిరని కొందఱు నుడివెదరు. అది యవిచారితరమణీయము చండాల సంసర్గము నిషిద్ధమేకానియెడల మొదట శంకరులేల నిషేధించిరి. జ్ఞానియగు వానికి జాతిదోషములు లెక్కింపఁబడవనియు వాఁడు గౌరవార్హుఁడనియు నే వారి తాత్పర్యము గాని వాని ముట్టుకొనవలెననికాని వాని యన్నము భుజింపవచ్చునని కాని కాదు. అటులే యైనయెడలఁ బ్రపంచమున నెల్లెడలను జండాల స్పర్శనిషేధమే నేఁటివఱకును లేక పోవును. ధర్మమూర్తులును జగద్వ్యవస్థాపకులును నగు శంకర రామానుజాది మతాచార్యులు వెనుకఁజూపఁబడిన శ్రుతిస్మృతులకు విరుద్ధములగు చండాల సంసర్గాదులంగీకరించి యుండలేదు.

ఒకవేళ దేశనాయకులకుఁ గోపమువచ్చునని వారికారుణ్యమును బడయఁగోరిన శ్రీద్వారకాపీఠాధిపతులును గరవీరపీఠాధిపతులును స్పర్శదోషములేదని నుడివిన నావాక్యమును బాటింపఁదగదు. పీఠాధిపతులకుఁగూడ నియామకములగు శ్రుతిస్మృతులు స్పర్శదోషము నిరోధించుచుండ వాని యాజ్ఞనుమీటి యెవ్వరుచెప్పినను నావచనము బహిష్కరింపఁదగినది. కనుకనే, శ్లో॥ శ్రుతిం పశ్యంతిమునయః స్మరంతిచతథా స్మృతిం, తస్మాత్ప్రమాణముభయం ప్రమాణైః ప్రమితం భువి, యోవమన్యేత తేతూభే హేతుశాస్త్రాశ్రయాన్నరః, ససాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః॥ అనిసర్వజ్ఞుఁడగుమనువునుడివెను. ఓమహాజనులారా! భరతఖండాభిమాని దేవతయని చెప్పఁద

గిన శ్రీ గాంధి మహాత్ముడు చెప్పినట్లే విదేశవ్యాపారముల నణఁగద్రొక్కి వస్త్రములు మొదలగువానిఁ దమంతటఁదామే నిర్మించుకొని పరాపేక్షలేక మితవ్యయులై వర్తింపుఁడు. దేశవిపత్తు సంభవించినప్పుడు స్వగృహదోషములసరకుగొనక ముప్పదియొక్కకోట్లభారతీయులు నొక్కదేహముకైవడిఁ బాటుపడుఁడు. ఇదియే గాంధి మహాత్ముని యుపదేశముయొక్క సారము. అనవసరములగు పంచమస్పర్శ్యాదుల జాతిధర్మములలోఁ బ్రవేశపెట్టుట వారితాత్పర్యమై యుండదు అందువలనఁ బ్రయోజనములేదు. పరలోకనష్టముగలదు. మనభారతీయులలోని పరలోకప్రధానములగు ధర్మసేతువులు తెంపివేసి యితరదేశస్థులవలె మనమును మనుష్యమాత్రులమై యుంటిమేని బ్రతికియుండినను జచ్చినవారలమే. స్వరాజ్యముకావలెనను మాటకుస్వవర్ణాశ్రమ ధర్మముకావలెననియే యర్థము. మానవజన్మమునకుఁగూడు గుడ్డలు సంపాదించుకొనుటయే ప్రయోజనము కాదు. పారలౌకిక ధర్మముసంపాదించుకొనుట పరమప్రయోజనము. అట్టిసదుపాయములు పరరాజుల పరిపాలనమువలన మనకుఁతగ్గినవి. స్వరాజ్యమువలన నిట్టి లాభములు వేలకొలఁది మనకుఁజేకూరును. కనుక నిట్టిస్వరాజ్యప్రాప్తికై యెన్నియిడుముల సహించినను సహింపవచ్చును. ఎంతద్రవ్యయమునకైన నోర్వవచ్చును గాన నీమహాత్ముఁ డుపదేశించినసహాయ నిరాకరణము మొదలగు శాంతి పూర్వకములగు నుపాయములు దేశోద్ధరణ హేతువులగునే మాయభిప్రాయము.

పరలోక సాధనములగు వర్ణాశ్రమధర్మముల నశింపఁజేసి వర్ణసంకరమును గలుగఁ జేయఁదలఁచునెడల నట్టివారియుపదేశము శిష్టుల కగ్రాహ్యమగును. అట్టి స్వరాజ్యము భారతవర్షోన్మూలనహేతువగును. కనుక ధర్మమూర్తి యనఁదగిన మహాత్మగాంధిగారు పరస్పరవైమత్యములఁజెందక యందఱును నొక్కుమ్మడి దేశక్షేమమునకై పాటుపడుఁడని చెప్పినవాక్యము మనమవశ్యమంగీకరించవలెను. పరలోకప్రధానమగుధర్మము శాస్త్రానుసారము నడుపుకొనవలెను. ఇట్టి గాంధీగారియుపదేశము నైకకంఠ్యముచే మహాజనులాచరించెదరుగాక. ఇట్టిదృఢ సంకల్పమును మనహృదయములలో నీశ్వరుండు నెలకొల్పి స్వరాజ్యము నొసంగుఁగాక. ఇట్లు శ్రేయోభిలాషి

1-4-21 మల్లాది రామకృష్ణశాస్త్రి సోమయాజి

## —• స్వ రా జ్య స మ స్య. •—

ఇదియుఁ బ్రకృతము భారతీయులచేఁ గోరఁబడియెడి స్వరాజ్యమును గూర్చి వ్రాయఁబడినదియే కాని పైన వ్రాయఁబడినదంతయు వచనరూపముననుండ నిది పద్యరూపమున నుండుటయే కాక మనరాజ్య మీస్టిండియా కంపెనీవారి వశమైనది మొదలుకొని నేఁటివఱకును జరిగిన ముఖ్యాంశముల నన్నిటిని దెలుపఁగలదియై యున్నది. ఏతద్గ్రంథకర్త సత్యహరిశ్చంద్రీయ సాత్రాజితీయాది నాటకకర్తయై యాంధ్రదేశమునఁ జాలవన్నెగాంచియున్న బలిజేపల్లి లక్ష్మీకాంతకవి. ఈయనకవిత్వము రుచిచూడని రసికలోకమే యుండనపుడు నేను విశేషించి వ్రాయుట పిష్టపేషణమని విడిచెద.

## చో ర పం చా శి క

కం॥ చోరులవిధ మే నెఱిఁగి యాఱుగుపద్దెముల నేర్చినంతను జెప్పెదీ
వారసి చెవిలోమాత్రము జేసుచుమిఁక దయ యెటున్న సీతారామా ॥

కం॥ కొందఱు పందలుభువిలో బందులవలె మింగుచుంద్రు పరులది రుచిగా
ముందర జముఁడే గాసిం జెందెదమని తెలియలేరు సీతారామా!॥

కం॥ రోయక యిది మిక్కిలియు న్యాయమటంచాదిలోన ననదయగుచు నీ
పాయపుఁబనులనొనర్చిన నీయనరేబుధులువాని సీతారామా!॥

కం॥ గట్టిగ గట్టినమాటల నెట్టోవిడఁదీసి దొంగిలించినమాత్రిం
దిట్టరి చూచినమీఁదటఁ జెట్టుచెడుఁగయనుచువాని సీతారామా!॥

కం॥ పరువుఁ బ్రతిష్ఠయు మదిఁ గనికరముం బోద్రోచి పెద్దకఱవేరానీ
సరసులు మూడివిత్తురె యాచ్చెరువుగఁ జెను నటులుదక్క సీతారామా!॥

కం॥ కనఁడు మహాత్ములటంచున్ గనఁ డాత్మగౌరవంబనటంచుఁ గనఁడుపరులటం
గాచ్చులే మాటికిముడి కోసినసిగ్గిఁడి మొండిశ్రైట్టె సీతారామా!॥

కం॥ కూటికిరమ్మనిరియున్నిరొయు మాటలుపదోపఁగ జెపి మతకరిమగుచున్
మాటలువారించుచెనటికిఁ జేటులురాకున్నెముందు సీతారామా!॥

కం॥ ఈకాయముసతమనుకొని యేకాలము నదరుబెదరునెఱుఁగక కటకట! యే
వో కూడులు దినుచుందు రిసీ కాల్పనె వారిబ్రతుకు సీతారామా॥

కం॥ మాయురెయొంతటికైనను. కోయఁడుదుజన నుఁడులోన కోపెలఁదివలెన్.
మాయలుపచరించును జీచీయనినను సిగ్గుపడఁడు సీతారామా!

కం॥ హెచ్చగుదారిద్ర్యంబున బచ్చెపుదొంగగుచు భువినిబ్రతుకుటకన్నన్
మెచ్చగఁ బెద్దలువాఁడికఁ జచ్చునఁబడి చావమేలు సీతారామా!

కం॥ సతులకు సుతులకు నైధన మతి [శ ఈ ముగ గడనఁజేతు రా] యాసతులున్
సుతులున్నత్తురెతఃలోఁ జితిఁబేచెఁడికాలనుందు సీతారామా!

కం॥ మంచిగమాటలఁ జెప్పుచు మంచిగఁదనునమ్మ నట్టిమాన్యులమాటల్.
గొంచెముఁ గనియట్లుంటన శించెడి కాలమునఁగాదె సీతారామా!

కం॥ చుట్టాలమురమ్మని వార్గట్టినమూడివిప్పి సొమ్ముగైకొనఁజేతుల్
కట్టా! యెట్టాడునో కో చిట్టపురాయో మనస్సు సీతారామా!॥

కం॥ బ్రతికినరోజులు మంచిగ బ్రతుకవలెన్ లేక నూతఁబడవలె కాలిన్
గుతికఁదఁగట్టుక యింతకు ఛీతివేర్గతిలేమలేదు సీతారామా॥

కం॥ చేయుటొ పెద్దల పూజలు చేయుటొ నానావ్రతములు చేయుటొ క్రతువుల్
చేయుటొ దానంబు లరయా! చేయుట యీదొంగతనము సీతారామా!॥

కం॥ ఎగ్గనితలఁపక మదిలో బ్రెగ్గడలదె మాట దడవి పెంబోతువలెన్
బెగ్గలిక ముడిగి తిరిగెడు సిగ్గెట్టుఁ లేదొ తనకు సీతారామా॥

కం॥ గడనకుఁ బెద్దలమాటలు దడవుటయేకాక మంచిదారులు లేవే
నడపీనుఁగనుచుఁ దిట్టరె చెడమడనకుఁ డిట్లు మెలఁగ సీతారామా!॥

కం॥ కొందఱు కన్నపుదొంగలుఁ గొందఱునగ కత్తిరించుకొనువా ర్వగతే
యిందఱిలో బలువాసిం జెందెను ముడివిప్పుదొంగ సీతారామా!॥

కం॥ ఏజాతిపురుషుఁడైనను నీఁజాలినవాడె మేటి యితరులసొమ్ముల్
గాఁజేయువాడె యధముఁడు సీ జాతులతోఁ బనేమి సీతారామా!

కం॥ మంచికొలంబునఁబుట్టిన మంచిగఁ బెతిగినను ద్రవ్యమంతుండైనన్
సంచితకర్మం బునను నశించెడిగుణ మబ్బునుగద సీతారామా!॥

కం॥ సచ్చరితుల విత్తంబులు విచ్చలవిడిఁ దినుటకన్న వేర్గతిలేదే
విచ్చంబెత్తఁగరాదే చెచ్చెరఁ బారాదె లేక సీతా[illegible]మా!
ఒల్లయుఁ దనుఁ జచియును పల్లదముంజేసి యాడి ప్రల్లదము లరయా!
చెల్లాని నేర్పున నమ్మక చెల్లమ తోమెలుఁగనినన సీతారామా!

కం॥ కనుమూసి పాలుద్రావుచుఁ దను నెఱుఁగరటంచుఁ బిల్లి తలఁచినమాడ్కిన్
గనుగప్పి దొంగపని సేసినఁ గనరం చెంచు జడుఁడు సీతారామా!॥

కం॥ ధనమునుజూచిన నెంతటి ఘనులకు విపరీతబుద్ధి కలుగు నిజముగా
మనుజాధములగు నెక్కటిచెనటులకుం బుట్టుటెంత సీతారామా!॥

కం॥ అయ్యగారికిఁ దిరుణామముఁ బుయిలోడక పెట్టు నాలిముచ్చులకువి
స్మయమేలా పరులయెడన్ జెయిరాదే దొంగపనికి సీతారామా॥

కం॥ పుట్టకరో నేర్చెదరో పుట్టియు నేర్చెదరొ యీనిపుణతను ముడులన్
గుట్టుగవిప్పుట యందునఁ జెట్టులకుఁ బ్రతిష్ఠలేల సీతారామా॥

కం॥ ఏవాసివన్న నెఱుఁగని దేవన్నకు వట్టి పరమ దేబెకు నీతుల్
వేవేలు సెప్ప నబ్బునె చేవాటుతనంబుగాక సీతారామా॥

కం॥ లొగ్గిడితిండులు దినుచు న్సిగ్గింతయు లేక తిరుగు హీనుల గనఁగా
సిగ్గగుచున్నది వారికి సిగ్గేలా లేదొ లోనసీతారామా॥

కం॥ఎనయగా నన్నిట దొంగయుఁ గనమానిసివంటి వాఁడె కాని నిలువె
ల్లనుజక్కఁగఁ బరికించిన వేఱొకవేల చూపు సీతారామా॥

కం॥చేతురు దొంగతనాలను నేతురు కొంపలను గూల్ప నీకపటమెసా
బూతులు దిట్టెద రహా!యీ సేఁతల కేమనఁగవచ్చు సీతారామా॥

కం॥ముచ్చుతనంబున నెంచుట హెచ్చగ ద్రవ్యంబుగూర్ప నిదిపొసఁగదు కా
లచ్చెలగొట్టెద రడిగినఁ జెచ్చెర నేమెఱుఁగనని సీతారామా॥

కం॥ బొక్కలుద్రవ్వ గణించుట కక్కురితియు కాని తీయఁ గలకాలంబున్
జిక్కానె రొక్కము చూచిఁ జిక్కులఁబడనౌనుగాని సీతారామా!॥

కం॥ పన్నుగ ముడివిప్పుటలకుఁ బన్నుగడ లున్నవచ్చుఁ బ్రక్కలువిలుగన్
దన్నెద రెన్నటికైనను జిన్నతనమువచ్చుఁగాదె సీతారామా!॥

కం॥ ఇక్కడి వారినికన్నులు మొక్కలముగఁ గప్పినను జనుని నయనంబుల్
నెక్కమెకప్పఁగ నాతఁడు చెక్కలుగాఁ గోయుఁగాదె సీతారామా!॥

ఉగురిలోఁ దలయెత్తుట కలదే యీజన్మమునకుఁ గలబందుగులో
…ర కీజెలమెత్తుర మెలఁగనిట్టు సీతారామా!॥

కం॥ ఎన్నడు నమ్మరు నవలా మిన్నలపొందులనుగోరి మెలఁగెడి వెడు దం
దన్నను గడు మడివిడుపుంజిన్నెలుకలవాని నెవరు సీతారామా!॥

కం॥ఏవారలు నిరసింతురు చీవాటులుగల్గు వచ్చుఁ జిన్నతనంబున్
బానాలదెబ్బలొదవును చేవాఁడితనంబు గలుగ సీతారామా॥

కం॥ఆలికి నన్నము పెట్టుట చాలగ భరమయ్యెనేని చౌర్యముకన్నన్
గూలికిఁబోరాదే యది శీలమునకుఁ దక్కువగునె సీతారామా!॥

కం॥ఇలదిన మెతుకులకలవై మలమలమాడినను జాలమాడెద రిటు పె
ద్దలవిత్తము దొంగిలి గాసిలఁజేతురె మానఘనులు సీతారామా!॥

కం॥ పలువిధముల నార్జనమును సలుపుదురు నిజంబు దెలియఁజాలకయ నరుల్
కలకాల ముండు నేసిరి శిలలే చాపుండుటకును సీతారామా॥

కం॥ ఎప్పుడొ యేరోజుననో దప్పదుచా వెంతటి సరదారులకైనన్
దప్పక యిదెవచ్చెదనని చెప్పదుకదమిత్తి యెపుడు సీతారామా!॥

కం॥ ఇంతటిభాగ్యంబునకే యింతటిద్రోహములనైన హీనులు చేతుర్
చెంతనె మృత్యువు కలదని చింతిల రదియేమొకాని సీతారామా॥

ఆ॥ శివసమానమైన శ్రేష్ఠమౌ దైవంబు గంగ ననుకరించు ఘననదియును
దయకుఁ దుల్యమైన ధర్మంబు హింసకుం దులితమైన పాప మిలను గలదె,, ౧౪౮

వ॥ అనిన విని పరలోకభయాతురుండనగు నే నహింసాస్వరూపంబు సత్పురుష
ముఖంబునఁ దెలిసికొనఁ దలఁచినవాఁడనై ౧౪౯

క॥ "అనఘా! పెద్దలవలనను వినియుండినవాఁడ నొక్కవిషయము మును నే,
జనపాలురు వనమున మృగహననము గావించి పొందరఁటకద యఘముల్, ౧౫౦

క॥ మాంసము చిరజీవితమును మాంసలతయు నొసఁగుననుచు మతిమతిదానిన్,
శంసయొనర్తురు వైద్యులు, హింసాకర్మంబులేక యెట్లది పొసఁగున్, ౧౫౧

క॥ కావున నీవిషయంబున నీవ వచింపంగవలయు నిశ్శ్రేయసమై
తా వెలయునట్టిపద్ధతి, యావిధమున నడతు నే నిరాటంకముగన్" ౧౫౨

క॥ అనుటయు నపూర్వపురుషుఁ డిట్లను "నట్లనఁబోకుమయ్య, యయ్యది మాంసా
శనులగు నసాధువులమత, మెనయుం బాపంబు వారి నిప్పనివలనన్, ౧౫౩

క॥ అక్కటా! క్రూరాత్మకులయి యక్కటికము లేక మాంస మనవరతంబున్
మెక్కెడు మూఢులదౌ స్థితి మిక్కిలి శోచ్యతమ మగును మ[illegible]నన్, ౧౫౪

క॥ కాదెంచి యాయురారోగ్యాదులకుం గారణంబు ధర్మపరవర! దు
ర్వాదమిది, విను వచించెద నీదానికిఁ దగిన మంచిదృష్టాంతంబున్, ౧౫౫

క॥ పొలసుందిండులలోనను గలరల్పాయుష్కులవని, గలరు సరోగుల్,
కల రొక్కించుకయైనను బల మంగములందు లేక పనవెడివారల్, ౧౫౬

చం॥ పొలదినకుండనుండు నరపుంగవులందును నెందఱో భువిన్
గలరు చిరాయువుల్, సుదృఢకాయులునుం గల, రామయాప్తిలే
కలరెడివారుగూడఁ గల, రందున దానికి దూరమంద వ
ర్తిలవలె నెల్లవారు మహిదేవవరేణ్య! కృపావిశిష్టులై, ౧౫౭

ఆ॥ ఎవఁడు బ్రదుకఁ దలఁచి యిలనుండు జంతుల యూరువులను మెసవు నెసక మెసఁగ
వాఁడు ఘోరనరకవాసియై యాజంతుపటలిచేత నమలఁబడుచునుండు, ౧౫౮

క॥ ఒదవదు నంజాడు తృణమున, నొదవదు కాష్ఠమున, మఱియు నొదవదు శిలలో,
నెదొ యొక జంతువు హతమగుపిదపన యది యొదవుఁ గాన విడఁదగు దానిన్ ౧౫౯

ఉ॥ కాలికి ముల్లు గ్రుచ్చుకొనఁ గష్టమగున్ మన, కట్టిబాధ భూ
తాళికి నుండు శస్త్రములఁ బట్టి భుజింబడఁ ద్రోసి కోయుచో,

నేలబహూత్తులింక, నిదియేకద మాంసము వర్జనీయమ౯
గోలమునా నిదర్శనము కుంభినినిర్జర! యట్లుగావున౯ ౧౬౦

క॥ తమతోడఁ బోల్చుకొని యాక్రమమున భూతములనెల్లఁ గనుగొనవలయు౯,
దమశక్తిఁ గొలఁది వానిని శ్రమపెట్టక ప్రోవవలయు సజ్జనతతికి౯, ౧౬౧

సీ॥ అట్టిఁ గుత్తుకఁ గోయువటువంటివాఁడును నద్దాని కనుమాలుఁడైనవాఁడు
ఖండఖండంబులు గావించువాఁడును వంగడిం గూర్చుండి యమ్మువాఁడుఁ
గ్రియధనంబునొసంగి కైకొనువాడును వలయువిధంబుగా వండువాఁడు
వలసినవారికి వడ్డించువాఁడును దినిలెస్సఁ "దృప్తోస్మి" యనెడువాఁడుఁ
దలఁప నెనమండ్రుగూడ ఘాతకుల, మఱియు నర్థమునొసంగి భక్షించి హాత మొనర్చి
క్రియక ఖాదక ఘాతక త్రయమొనర్చురథము త్రివిధంబరయి యన్యవిధముఁ దనరు,

ఆ॥ గర్మమునను మదిని గాయంబుచేతను నెవఁడు హింససేయఁడించుకేని
వాఁడు మృతిజరావివర్జితంబైన యత్యున్నతంపుఁబదము నొందఁగలఁడు, ౧౬౩

తే॥ శాకమూలఫలాహృతి జరుపుకొనుచు బ్రహ్మచర్యవ్రతస్థుఁడై పరఁగుచున్న
యట్టివాఁడు నహింసకుండందుఫలము నంద నేరడు సర్వంసహానుకేంద్ర! ౧౬౪

తే॥ ఒకఁడు వర్షశతంబులు మిక్కిలి తపమాచరించు మేదినిలో౯, నిం
కొకఁడ దహింసకుఁడయ్యెడు, నెక్కుడు వీరిరువురం దహింసకుఁడే యగు, ౧౬౫

క॥ ఎదఁద దయామయుఁడగునెడఁ బడయంగారానియట్టి బలుకోరిక యుఁ౯
బడయంగఁగలఁడు మానవుఁ, డడుగం బనిలేద యేతదర్థము నింక౯, ౧౬౬

చం॥ తలఁచినచోటికెల్లఁజను దండివిమానము నెక్కి దేవతా
లలనలుగొల్వ సూర్యురు విలాసముతోడ దివంబునందుఁడా
మెలఁగుచునుండు భూతదయమిక్కిలిగల్గి చెలంగునట్టి యా
యలఘుఁడు భూమిదైవతకులాగ్రణి! వేలుపువోలెఁ బ్రీతిమై" ౧౬౭

వ॥ అనిపలికి యమ్మహాత్ముండు నేనువిలోకించుచుండ విమానశ్రేష్ఠం బధిష్ఠించి గంధర్వులచే గీయమానుండును గిన్నరులచే స్తూయమానుండును నగుచు మదక్షరమంత్ర మాహాత్మ్యంబునంజేసి త్రిదశాలయంబునకుఁజనియె, నట్లతండు చనుటయుఁ బూర్వాహతంబులగు సర్పంబులఁ దలంచుకొని యొడలు విఱిగినట్లుకాఁ జేసినపాపంబునకుఁ జింతిలుచు నదియ మహావనంబునం జేసి "క్కట్టా! మాత్రుండనగుకాచే నెన్నిప్రాణులు సమ

యింపఁజనిరి, మిత్త్రిగొంగంగూడ మిక్కిలి దూషించితిఁ, గావున వరకహితంబునం గూలవలసినవాఁడనైతి, నింక నేను మాంసం బరిత్యజించి యుద్ధతపం బొనరించెద, శివదీక్షం గైకొని సిద్ధేశ్వరుం బూజించెదఁ, ద్రిలోకంబుల జనులు దేనినైనను దపమ్మునచే సాధింతురుగావున నయ్యది యాచరింపనగు, నొక్కండన యొక్కొక్కదినం బొక్కొక్కవనస్పతిశకల భక్షింబెత్తుచు మౌనవ్రతంబుఁబూని మునినై యమ్మునిపల్లెల్లం జరియించుదు, నిష్టానిష్టంబుల నన్నింటిని వదలియెవ్వాఁడును లేకుండిన యింటనో యేదేని యొకచెట్టు మొదటనో ధూళిధూసరితాంగుండనగుచుఁ బ్రవర్తించుదు" నని యిట్లనేక ప్రకారంబుల విలపించి భక్తియుక్తుండనై శివదీక్షావ్రతంబును స్వీకరించి సిద్ధేశ్వరుని సమీపంబున నిత్యంబును ద్రిసంధ్యలఁ బదివేలపడక్షరమంత్రంబు జపియించుచుండి యయ్యుఁ జక్రప్రభావంబున శాకీయావనంబు సుస్థిరంబైనిలిచె, నట్లు లోకాంతరజ్ఞానంబును ఖేచరత్వంబునుం బడయఁగలిగితి, ద్వాపరాంతంబున సిద్ధేశ్వరునిలో నైక్యంబు నొందెద, నిదినిక్కువంబు, సర్వపాపవినాశకంబు, మోక్షదంబు, ౧౬౭

కం॥ ఎవఁడిది ప్రతిదినమందును శ్రవణం బొనరించుచుండు శ్రద్ధాన్వితుఁడై

"వాఁగణపతిగణ కవివేకిత నాఁడొనరు, నసుతులు తోలఁగుక" ౧౬౮

సీ॥ [illegible] సర్పములరొదిన్ని సమస్తము నాక్రమించె, నీ

కేయని తెల్పువారమవి యుద్ధాసరించెడిదుష్టకృత్యముల్" ౧౬౯

వ॥ అనియిట్లు మొఱపెట్టుకొనుటయు నాప్రజాపతి శేషుండులోనుగాఁగల నవనాయకులంబిలువంబంచి "జనసంక్షయకరమైన మీసంతతికి బుద్ధిఁజెప్పుకొనుం"డని యాజ్ఞాపించిన వారును "వల్లె"యని మీఁదఁ గ్రానిరి, యైనను నాశివినంబులసంఖ్య యత్యధికంబగుకతంబున నప్పని యథాపూర్వంబుగన యాచరింపఁబడుచుండె, మొదలింపఁ బడియుఁ బంచజనులఁ బంచత్వము నొందించుటను బహుదుఃఖావిష్టుండై దేవతామధ్యస్థితుండగు నాచతుర్ముఖుండు సర్పకులాధిపతులఁ గనుంగొని యిట్లనియె, ౧౭౦

ఉ॥ "తప్పొక యింతలేకయును ధాత్రిజనంబులఁబట్టి చెడ్డవై

సర్పములన్నియుం గఱచిచంపుచునున్నవి, మున్నె మీకు నే

జెప్పినవాఁడఁ జెప్పిన నినీ యవి లక్ష్యము సేయకున్న, వీం

కెప్పటికిట్లుచేయనటు లేనిఁక నిగ్రహముం బొనర్చెదన్" ౧౭౧

కం॥ జనమేజయుండు నా నొకజనపాలుఁడు బయలు వెడలుఁ జొక్కసలిలోఁ, జే

యును బన్నగులకతి, యుదయ్యాడె వనలఁబసుభక్షించు నేలదహీతుల మెల్లన్ ౧౭౨

చ॥ జననియుఁగూడ నిచ్చెమును శాపము వీరికి, నస్మదుక్తి బా
నిన సుదృఢంబు చేసెడిని, నిశ్చయ మియ్యది, మంత్రరాజిచే
తనయుని యీడ్వఁగాఁబడుచుఁ దప్పక మండెడి యగ్నిలోఁ దమ
తనువులు దెంచి మీరలు స్వకృతంబగు పాపము పండుచుండఁగన్" ౧౯౩

వ॥ అనిన విని ఫణిపతులు తమ్ముండ్రును గడగడ వడంకుచుఁ గైదోయి మోడ్చి కమలాసనున కిట్లనిరి. ౧౯౪

ఆ॥ "విసము మున్ను పెట్టి వెన్క మమ్మందఱఁ బుట్టఁజేసితీవ పూర్వమందు,
జాతి కుచితమైన సరణి వర్తించు మమ్మేల కోపగించె దిట్టులార్య!" ౧౯౫

వ॥ అనిన విని హిరణ్యగర్భుం డిట్లనియె, ౧౯౬

క॥ పెట్టి విషంబును గోరలఁ బుట్టించిన మాట నిజము పూర్వము మిము నే,
నెట్టి యపరాధమేనిఁ గనియట్టి ప్రజం గఱచి చంపు టర్హంబగునే" ౧౯౭

క॥ అనవిని విషధరపతు లిట్లని, "రేమిటికాగ్రహంబు నందెదు మాపై,
జనులకు మాకును నదొయొక ఘనముగు మర్యాదఁ జేయఁగాదగు నింకన్, ౧౯౮

ఆ॥ అటులఁ గాకయున్న నసువు మింకెటకేని జనవిహీనమైన స్థలమునకును,
సర్పకులము మనుపు జనమేజయక్షితీశమఖకృతాగ్నిలోన మ్రగ్గకుండ, ౧౯౯

క॥ త్వదభీష్టమైన మార్గం బెది వెదకదొ వెదకి మదిని నీ ఫణికులముల్
తుదముట్టకుండఁ జేయంగదవయ్యా బ్రహ్మదేవ! కరుణామతివై" ౨౦౦

వ॥ అని యిట్లు విన్నవించు నాగులం బొడఁగాంచి తమ్మిచూలి యిట్లనియె, "జరత్కారుం డనునొక బ్రాహ్మణుండు బిడ్డలంగనెంచి పెండ్లికై పిల్ల నన్వేషింపఁగలఁ, డయ్యెడ మీ కోలంబున జరత్కారుస్వయను నొక సురుచిరాంగి యవివాహితవర్తించు, నాతని కావరవర్ణినొసంగి పరిణయంబు గావించిన వారల కుదయించిన బిడ్డండు జనమేజయు సర్పయాగంబున మహీసురోచ్చార్యమాణ మంత్రాకృష్టంబులగుచు నగ్నికుండంబు నకచ్చిపడుచుండ నందరుదెంచి చావఁగామిగిలిన సర్పంబుల సంరక్షించెడి నతలవితలాద్యధోలోకంబులకేగి మీ రందవసించునది, భుజగానురూపంబులగు భోగంబు లందు మీకుంగాఁ గల్పించెదఁ, గావున మహీతలంబునుండి వేగంబ కదలిపొండు? పోయి సురాసురులకును దుర్లాపంబులగు భోగంబులఁ బుత్రపౌత్రసహితంబుగా భుజియింపుం"డని బ్రహ్మచెప్పుటయు నాగులిట్లనిరి, ౨౦౧

ఉ॥ భోగములెన్నియుండినను బోయివసింపఁగఁజాలమయ్య మే
మాగుహలోన, నేటికిటు లాజ్ఞయొసంగెదు, భూమిలోని యే
భాగమునందొ యుండెదము, పంచజనంబులతోడమాకు నీ
వేగతిఁగట్టుచేయు నటులే చరియించెద మోపితామహా!" ౨౦౨

వ॥ అనియిట్లెఱుంగునఁబ్రార్థించుటయు నవ్వాణీరమణుండు వెండియునిట్ల

ఉ॥ "శ్రావణకృష్ణపంచమిని సర్పములన్నియు నుండవచ్చుఁ ద
ద్ద్వీపవలయంబునందునఁ, దదన్యదినంబులయందుమాత్ర మ
చ్చోవసియింపఁగాఁదగమిఁ జొచ్చిరసాతల మందయుండనా,
నావచనం బలంఘ్య మహీనాయకులార చనుండుఁగోరికన్," ౨౦౪

కం॥ కులముఖ్యులైనమీ రయ్యలఘుచమత్కారనగరమందునసతతం
బెలమినివసియింపఁగఁదగు, నిలఁదగదన్యహిపులము నిజముగనచటన్ ౨౦౫

కం॥ తమతెరువుగానిప్రజ నక్రమముగవధియింపఁదగదు కఱచిఫణుల్, మం
త్రము లోషధు లెఱిఁగిన బుద్ధిమంతుల కెరఁగి యొండుదెస కరుగఁగనౌ" ౨౦౬

కం॥ అనియీగతివచియించుడుఁ జనియెఁ బాతాళమునకు సర్పకులంబుల్,
ఘనులగుకులపతులందఱు మనిరా క్షేత్రమునకేగి మహిమాన్వితులై, ౨౦౭

తే॥ అచటశ్రావణపంచమి నహిపతులకుఁ బూజగావింపనిష్టములొందునరుఁడు,
వానికులమున జనియించువారికేని యురగములనుండియేమాత్ర ముండదళుకు, ౨౦౮

కం॥ కలుగవుపద్వంశజులకు బలుతెగులులు, మారితెగులు ప్రాప్తింపదటుల్
కలుగదు భూతభయంబును, నిలఁదక్షేత్రంబుమహిమ మెంతటిదగునో, ౨౦౯

కం॥ తనయవిహీనుఁడచటికిఁ జని శ్రాద్ధంబాచరింప సత్పుత్రకులన్
గని పితరుల కనృణుండగు మునులార! తదీయమహిమమునఁజేసి వెసన్, ౨౧౦

ఆ॥ గొడ్డురాలుగూడఁ గులదీపమందగు కొడుకుఁగాంచి సుఖముఁబడయఁగల్గు
నాగపంచమీదినమున సూర్యోదయవేళ నచట స్నానవిధిని నెఱపి, ౨౧౧

ఆ॥ భ్రష్టరాజ్యుఁడగుచు బఱితెంచునొడయండు నాగపంచమీదినమున నాగ
తీర్థమందుఁగ్రుంకి యర్థినాగులఁగొల్వ మగుడఁబ్రాప్తరాజ్యుఁడగు రయంబ, ౨౧౨

ఆ॥ సర్పదష్టులగుచు సమసినయవ్వార లిచట శ్రాద్ధతృప్తి నెనయుదనుకఁ
ప్రేతలై వసింత్రు, పెద్దనిదర్శన మింద్రసేననృపుఁడ యిందులకును, ౨౧౩

## ఇంద్రసేనవృత్తాంతము

ఉ॥ ఉండెను నింద్రసేనుఁ డన నొక్క మహీశుఁడు తొల్లి, మార్తురన్
జెండెను, నశ్వమేధములఁ జేసెను, నాత డొకప్డు సజ్జపైఁ
బండియుఁ యుండ నింట నొకపాడు భుజంగము మేఁగుదెంచె నెం
డియ్యొ, యేగుదెంచి యతఁ డబ్బోయనఁ గోలుల దించె మేనునన్. ౨౧౪
ఆ॥ దించు తత్క్షణమున మించి దద్విషవహ్ని యంగకంబు లెల్ల వ్యాప్తమగుడు
మిత్తి మీఁద నటులె నత్తమిల్లెను వేఁడు నిదుర తుదకుఁ బెద్దనిదుర గాఁగ, ౨౧౫
వ॥ తత్తనూభవుండు తద్దయుం జింతిల్లి ౨౧౬
సీ॥ దహనసంచయనాది విహితకర్మం బంత స్మృత్యుక్త విధముగాఁ జేసినాఁడు,
అస్థికల్ గైకొని యరిగి కాల్నడతోన గంగాజలంబులం గలిపినాఁడు,
త్రైపక్షికాబ్దిక తత్సమాఖ్యల శ్రాద్ధముల్ వరుసలు సలిపినాఁడు,
అరిగి గయాశీర్ష మట ఫల్గునిని మున్గి విధితోడఁ బిండంబు వేసినాఁడు,
అన్నియుం దీర్చినాఁడు తనకన్న తండ్రియందుఁ గల గురుభక్తిమై నతఁడు కాని
ప్రేతభావంబు వదల దప్పితృకుఁ డమహాపకర్మంబు బోఁజెడు దారిఁబు బుధులార! ౨౧౭
శా॥ అంతన్ బాష్పజలప్రపూర్ణనయనుండై వచ్చి స్వప్నంబునన్
వంతం గుందుచు బిడ్డకిట్లనియె, "నో వత్సా! మదర్థంబు నీ
వెంతో కర్మ మొనర్చియుంటి, వది నాకీదాయె నొక్కింతయే
లంతం బొందె భుజంగమూలమునఁ బ్రేతాకారము న్వీడమిన్, ౨౧౮
వ॥ కావున వైళంబ చమత్కారపురక్షేత్రంబునకుం జని యందలి నాగతీర్థంబున స్నానంబొనరింపుము, దానం జేసి నేను బ్రేతాకృతిం ద్యజించి ప్రీతుండ నయ్యెద"నని యతం డదృశ్యుండగుటయుఁ దత్కుమారుండు మేల్కాంచి ప్రేతయై పడియుండు పితం దలంచుకొని పిమ్మటం జెంది త్వరితంబ తత్తీర్థంబునకరిగి స్నానంబు సల్పి పురోహితుండె భోక్తగా శ్రద్ధాసంయుక్తిని శ్రాద్ధంబు నిర్వర్తించె నంత ౨౧౯
కం॥ మరలఁ బిశాచమయగుచును దరిసెన మిడి స్వప్నమందుఁ దన కొమరునక
త్తతి నింద్రసేననామక ధరణీపాలుండు సేగిఁ దానిట్లనియెన్, ౨౨౦
శా॥ కాదొక్కింతయు లాభకారి సుత! నీ కావించు శ్రాద్ధంబు నా,
కీదానంగలయట్టి కారణము నీ కేఁ జెప్పెదన్ వినుమ్మ

ర్యాదల్భిన్నములైతనర్ప్వనిచటం, బ్రత్యేక మత్రత్యమౌ
భూదేవాళియె శ్రాద్ధకర్మములలోభుక్తింగొనంబాత్రమౌ, ౨౨౧

చం॥ మఱియొకచోట నింద్యులనిమానుకొనందగు శ్వాంగకాదులం
దఱు నిటనర్హులయ్యెదరు, దానమఖవ్రతముఖ్యభూసురో
త్కరకృతయాజకత్వమునఁగాఁదగుకర్మములెల్ల నిష్ఫలీ
భవమునకుండుబ్రాహ్మణుల వాక్యముచేతనె పూర్ణతంగనున్, ౨౨౨

ఆ॥ కర్మలోపముండుఁగాక విశేషంబుతీర్థవాసు లేగుదెంచియటను
సంతసంబుతోడ "సర్వము సంపూర్ణ"మనివచింపఁ బూర్ణమైచెలంగు, ౨౨౩

ఆ॥ తత్పరోక్షమందు ద్రవ్యమంత్రక్రియాదుల కొకింతకొఱత కలుగకుండ
నల్పసిద్ధిశ్రాద్ధములును సంపూర్ణత నందలేక వ్యర్థమగునుదనయ! ౨౨౪

కం॥ కావున నీపురమందలి భూవిబుధులఁ బిలువఁబంచి భోక్తృపదమునం
బావారిని నియమించి యథావిధి శ్రాద్ధంబుజరుపఁదగు నిటుపైనన్,, ౨౨౫

కం॥ అనియబ్భంగిని గలలో జనకుండువచించిచనియె, క్షణదాంతమునం
దున మేలుకాంచి కొమరుండు వనటఁ జమత్కారనగరవరమునకరిగెన్. ౨౨౬

ఆ॥ అరిగి బ్రాహ్మణార్థ మన్వేషమొనరింప వీధివీథిఁ బ్రతినివేశమందు
నందఱును ధనాఢ్యులైయున్నకతమున నొకఁడుగూడ దానికొప్పఁడాయె, ౨౨౭

సీ॥ దారిద్ర్యమనుపేర యేరికిం దెలియదు, కొంచెమే నెఱుఁగరు కొఱఁదలంబు,
కనఁబడ రొకరు నకర్మిష్ఠులగువార, లుండఁడు పామరుం డొక్కఁడేని,
మంగళరవము లేమందిరంబునవిన్నఁ, బ్రతియింట నుత్సవప్రక్రమంబ,
వీధివీధినిగూడ వేదఘోషంబులే, ధర్మచర్చయె ప్రతిస్థలమునందుఁ,
బ్రాజ్ఞులైనట్టి యాజ్ఞికప్రతతిచెప్పు యజ్ఞమంత్రంబులే యెటకరిగివిన్న,
నన్నియుపపత్తులంగూడియు నలరుచోట శ్రాద్ధపుంగూటికెవ్వండు సమ్మతించు? ౨౨౮

సీ॥ నెలమూడువానలు నిలిచివర్షించుచుఁ బర్జన్యుఁ డెచ్చోటుఁ బాయకుండు
సకలసస్యములును సంపూర్ణఫలములై కసులపండువు సేయఁగలుగు నెందు
నావులు నజములుం గావలసినయన్ని క్షీరంబులిచ్చి మేల్సేయునెచట
నఖిలసంపదలకు నావాసమై యేది కఱవునకే సదా కఱవుఁగూర్చుఁ
జోరభయంపడుచుండు నెచ్చోటఁ దెగులు కానఁగాఁబడదెచట నకాలమరణ
మట్టి సర్వోత్తమంబైనయగ్రహారమున లభించునె యాబ్దికంబులను భోక్త,

చం॥ పదపడి నల్లగ్రిక్కభువి వ్రాలుచుఁ బ్రాణము విడ్చెఁ బాకిపాఁ,
డదివిని పుత్రశాత్రుపు హృదన్వితుఁడై వడి దేవశర్మ బి
ట్టోద పెడికిన న్నయ్యెడపు హుమ్మనుచుం జని దూరగుండయై
పెదపెదమంటి పెల్లలను బృథ్వివుపైఁ బడ రువ్వె నొవ్వగాన్, ౨౪౨

ఆ॥ తాడనంబులకును దాళలేకాతండు ఘుర్ఘురసముచ్చరించి చూప జెందె
మపుడు దేవశర్మయాదిగాఁ గలవారలెల్ల విస్మయమున నిట్టులనిరి, ౨౪౩

కం॥ "కడజాతివానికేనియుఁ గడుఁ గష్టంబైనయట్టి కర్మము నడపన్
గడఁగితివిది యేమిటయా నుడువుచు స్పష్టంబుగాఁగ నోటను శ్రుతులన్, ౨౪౪

కం॥ శాపపరిభ్రష్టుఁడవై యీపగిదిం దిరుగు నొకమహీసురుఁడవుగాఁ
జూపట్టుచుంటి వెవఁడవు నాపృథివీపాలుఁ డిట్టులనె నవ్వుచుఁ దాన్, ౨౪౫

ఆ॥ "విష్ణుసేనుఁడనఁగ వెలసెడి రాజునయ్యండ, హేహయాన్వవాయ మస్మదీయ,
మిట్టినీచకర్మ మేడాదినుండియు జరుపుచుంటి నీదు కరుణఁ గోరి" ౨౪౬

ఆ॥ అనిన దేవశర్మ మనమున నీరయి ఘోర వంజలి నిఘటించి యని తానిట్టు,
''లింగచక్రకర్మ మెందునిమిత్తమై యాచరించుచుంటివయ్య నీవు, ౨౪౭

కం॥ చెప్పు మభీష్టంబెయ్యదొ తప్పక సమకూర్తుఁ బడయఁదగనిదియైనన్,
గొప్పదయగుఁ గాక దినా కెప్పనియుం గాదసాధ్య మిద్ధారుణిలోన్" ౨౪౮

వ॥ అనినవిని యమ్మహీపాలుం డిట్లనియె, ౨౪౯

కం॥ నాతండ్రి పాముగఱచుటచేతం బ్రేతత్వమొంది చింతిలుచున్నాఁ,
డేతన్నాగహ్రదమున నాతని శ్రాద్ధంబు సలుప నగు ముక్తుఁడు దాన్, ౨౫౦

తే॥ కానఁ దత్తారణార్థమై కర్మమునకుఁ గడఁగవలె నీవు విప్రేంద్ర! కరుణనుంచి,
యిందుకొఱకయి కాదె నే నిట్టి నీచకృత్యము జేయుచుంటి నీగృహమునందు" ౨౫౧

చం॥ అనవిని దేవశర్మ యిటు నయ్యెడ నేన స్వయంబ బ్రాహ్మణుం
డను, బొనరింపు శ్రాద్ధము ఘనంబుగ భూవర!'' యంచుఁ బల్క వా
తని తనుజాదులందఱును ధర్మముగాదిది నీవు శ్రాద్ధభో
జనమొనరించు, టప్పగిది కల్పిన నిన్నుఁ ద్యజించుతు రెల్లరున్'' ౨౫౨

కం॥ అనుటయు సాధూదేవుఁడు తనుజాతు! లవశ్యము గను ద్యజియించుఁ డుపో,
న్ననుడి తప్ప నేనిఁక'' నని యాతనిఁ గూడి తొంటి హ్రదమున కరిగెన్, ౨౫౩

ఆ॥ అరిగి శ్రాద్ధకర్మ మతనిచేఁ జేయించి తాభుజించుటయును దక్షిణంబ
యంబరంబునుండి యశరీరవాణియొం డాలకింపఁబడియె ననఘులార! ౨౫౪
శా॥ "ప్రేతత్వంబును బాసినాఁడు తనయా! పేర్మిం ద్వదారబ్ధమౌ
నీతచ్ఛ్రాద్ధము సేయ, స్వర్గమున కిష్టే యేగుచున్నాఁడు, నాఁ
గాతఁడు క్షేమము నీ" కటన్న నుడి యాకర్ణించి యాయంతనం
ప్రీతుండై యనె దేవశర్మ పదనీరేజంబులన్ ప్రాలుచున్, ౨౫౫
కం॥ "ఉన్నది మాహిష్మతియని యెన్నఁగఁబడు రాజధాని, యెంతయొ దేశం
బున్నది దానికిఁ జేరువఁ, దన్నగరి మదన్వయాగతంబయి నాచేన్, ౨౫౬
కం॥ ఏలంగఁబడుచునుండెను, శ్రీలందులఁ దూఁగుచుండ, భృత్యులఁ దన్నె ని
న్నోలిం గొల్చుచునుండెదఁ, బాలింపుము నీవ, నాకుఁ బనిలేదింకన్" ౨౫౭
వ॥ అనిన విని దేవశర్మ యిట్లనియె, ౨౫౮
కం॥ "తగదిగతి వచియింపఁగ సుగుణాన్విత! నీకు, తోణిసుతుఁ డెన్నటికిన్
దగఁడు ధరాపాలనమున, తగుదీవ తదర్హతమాఁడఁ వటుగాన విసన్ ౨౫౯
చం॥ అని భవదీయగాంభీర్యమును జక్కఁగ నేలు" మటంచుఁబల్కె నా
మనుజవిభుండు స్వీయపురమార్గముఁబట్టెను, బంధుమిత్రులె
ల్లను దను పత్యజించుటయు లక్ష్యము సేయక దేవశర్మ క
ట్టైనునిలు నాగతీర్థమున, శేవరొలర్ప వసించెనంద తాన్ ౨౬౦
కం॥ స్వాధ్యాయం బనుదినమును సధ్యయనముఁ జేపికొనుచు నతఁ డచ్చోటన్
మేధ్యుఁడయి యుండఁగలిగెన మేధ్యుండనివదల బంధుమిత్రులు దన్నున్, ౨౬౧
కం॥ అందుండియుఁ గనెఁగొందఱ నందనులను, వారలున్ సనందనులై, ర
ట్లందు బహిష్కృతులగుచును నెందఱో వసియించుచుండి రియ్యెడఁ గూడన్,
ఆ॥ నాగపంచమీదినంబున నీనాగతీర్థమహిమ నెవ్వఁ డర్థివినును
వాఁ డభక్ష్యభక్షవశమునఁ బ్రాప్తించు నఘములెల్లఁ బాయు నాక్షణమున,
తే॥ శ్రాద్ధముం బెట్టుతఱి దీనిఁ జదువు నెడల సంఘటిల్లును దద్గయాశ్రాద్ధఫలము,
మఱియు గోవ్యాఘ్రములనుండి మరణమొందు నట్టిఁడైనను సద్గతి కరుగఁగలఁడు,
ఆ॥ ద్రవ్యదోషములును బ్రాహ్మణదోషముల్ వ్రతములోలఁగు మీఁద వచ్చుదోసఁగు
లన్నియుం దొలంగు నార్థికసనుయమం దర్థిఁ జదువ నాగతీర్థమహిమ, ౨౬౨

## — సప్తఋష్యాశ్రమమాహాత్మ్యము —

ఆ॥ హాటకేశ్వరంబునందు సప్తర్షులయాశ్రమంబుగూడ నలరుచుండు,
శ్రావణీయపూర్ణిమావాసరంబున నచటనాడఁ దీర నభిమతంబు, ౨౬౬

తే॥ కందమూలఫలాదిశాకములతోడ నచట శ్రాద్ధంబుగావించు నార్యతముఁడు
రాజసూయాశ్వమేధంబు లోజజరిపు పరిభవుగాంచెడి యుత్కృష్టఫలముగాంచు, ౨౬౭

కం॥ "కరధరిధృతజపమాలుర! సురసరిదంభోవగాహశుద్ధతమాంగుల!
నిరతవితీర్ణేష్టుల! మాజరిపెడిపూజల్గొనుండు సప్తమహర్షుల్!" ౨౬౮

వ॥ అని యీమంత్రంబుచే నత్రి వసిష్ఠ కశ్యప భరద్వాజ గౌతమ కౌశిక జమదగ్న్యరుంధతుల యథాక్రమంబునఁ బుష్పధూపానులేపనాదిషోడశోపచారంబుల భాద్రపదశుద్ధపంచమీదినంబునంబూజించిన సకలాభీష్టంబులును సమకూరెడి"నని వినిన "సప్తర్షులచే నందేకాలంబునఁదీర్థంబు వ్యవస్థితంబయ్యెనో వినఁగుతూహలంబయ్యెడినిగాన విస్తరించిచెప్పవే"యని శౌనకాదులు ప్రశ్నించుటయు సూతుండిట్లనియె, ౨౬౯

కం॥ "ఇల ద్వాదశవార్షికమై నిలిచె ననావృష్టి ...
పరిశయంబుఁజేయుటయనది బలుభీతింగూరిరవుడు ప్రజలందఱునుఁ, ౨౭౦

సీ॥ ఎముక లొక్కటివక్క నితర మించుకయేని కనుపింపదయ్యెఁ దకాయములను,
ధర్మమనుమాట గ్రంథములలోననతప్ప వర్తింపదయ్యెఁ దద్వర్తనముల,
నుత్సాహమనునది యొక్కింతయేనియు నీక్షింపఁబడదు తద్హృదయములను,
సువరితాచరణ మెచ్చోనడంగెనో కాని తిలకింపఁబడదు తద్దేశములను,
అట్లు భూలోకమంతయు వ్యధితమగుడుఁ బిల్లలం దల్లులును మగ ల్పెండ్లములను
గృహులు భృత్యుల విడనాడి కృపణులగుచుఁ బొట్టతిప్పల కందండుఁ బోయిరకట,

సీ॥ చనిరియజ్వలు దేశసంచారములుచేయ నుత్పన్నశ్రౌతాగ్నిహోత్రులగుచు
నైరిదేశముకాను లతివృద్ధులుంగూడ వ్రతములునియమము లొదలిపెట్టి,
పలికిరి యథార్థములఁ బ్రాజ్ఞులగువారె కుక్షిపూరణ చేసికొనఁగలేక,
రొత్తిరిబికిరంబు నెంతెంతవారును లజ్జాభిమానంబు లుజ్జగించి,
యటులె సప్తఋషులుఁ గన్న మోరామచంద్రా!" యటంచు లేచి పోయిపోయి
చాలదినములకు వృషాదర్భిరయేలు నానర్తదేశమును గనంగఁగలిగి ౨౭౧

కం॥ అక్కడ భిక్షార్థంబై యొక్కొక యింటికి భ్రమింప నొకగింజయు నుణ్
జిక్కదు కేమని చెప్పుదు నక్కఱవు ప్రభావ మో మహామునులారా! ౨౭౩

వ॥ అంత

కం॥ కడుపునఁబుట్టెడిమంటకుఁ బడలేకా సప్తఋషులు ప్రాజ్ఞులయయ్యున్ ౨౭౪
గడసిపడియున్న యొకముని బుడుతం గాలిచి తినంగ బుద్ధిఁ దలఁచుచుఁ

వ॥ అగ్నిం బ్రజ్వలింపఁజేసి తచ్ఛరీరం బందుంచి పచనంబు సేయుచుండుటయు ౨౭౫

కం॥ విని కర్ణాకర్ణిక గా జననాయకుఁడైన యా వృషాదర్భి వడిన్
జనుదెంచిన వాఁడై యిట్లనె మునినాయకులతోడ సార్ద్రహృదయుఁడై, ౨౭౬

ఉ॥ "ఏమిది నింద్యమైనపని కిట్లు కడంగితి రార్యులార! మీ,
రీమనుజామిషాశన మదెంతయు రాక్షసకృత్యమౌనుగా
నీ మిము బోంట్లకుం దగదు, నేనిడనుంటిని వ్రీహులున్ యవల్
గ్రామము, లవ్వి గైకొని సుఖంబుగనుండుఁడు, వీడుఁ, డీపనిన్" ౨౭౭

కం॥ అనుటయు మునులిట్లని, "రాజమనుజేశ్వర! కలదు మర్త్యమాంసము దినుపై
జనులకుఁ బ్రాయశ్చిత్తం, బనివార్యము రాట్ప్రతిగ్రహాఘము చేసన్, ౨౭౮

ఉ॥ కావున [illegible] ఆసు గాల్చి పసాపడి యాస్తదియమా
జీవములన్ ధరించియును చేసికొనంగల మంత నిష్కృతిన్"
నావుడు భూవిభుండు "మునినాయకులార! ప్రతిగ్రహంబు స
జ్జీవికగాన విప్రులకుఁ జేకొనుఁ డేనిడు నీపదార్థముల్" ౨౮౦

క॥ అనినవిని వెండియును నిట్లనిరి వృషాదర్భితోడ సమ్మునిచంద్రుల్,
"జనపతివలనఁ బ్రతిగ్రహ మొనరించుట కన్న ఘోరమొండును ధరణిన్, ౨౮౧

కం॥ రాజప్రతిగ్రహ మీజగతి విషోపమాన మీక్షించినచో,
రాజేంద్ర! సురాపానము గాఁ జాతురుదీని నెఱుకగల మహీదేవుల్, ౨౮౨

సీ॥ దశహత్యలొనరించు సౌనసుం బురుడించుఁ దప్తచక్రాంకిత తనుఘనుండుఁ
దశతప్తచక్రాంకిత ప్రతీకాశుఁడౌఁ గృత్రిమలింగసంవృతశరీరి,
కృత్రిమలింగ సంవృతతనూదశకంబు నాసివర్తించెడి వారకాంత,
దశవారకాంతామతల్లులం దులఁదూఁగు నుర్వీభరంబూను నొక్కరాట్టు,
దశసహస్రసంఖ్య విశసనతుల్యమై రాట్ప్రతిగ్రహంబు రమణఁగాంచు,
దీని లోభియై ప్రతిగ్రహించు ద్విజుండు పొరయు ఘోరనాదినరకములను, ౨౮౩

క॥ తనుము ధవళ్ళిలయమునకు మనుజేశ్వర! కలుగునీకు మంగళశతముల్,
చనియెద మేమును సెటకో, యీ సనొల్లమునీధనంబు కొలఁదిగ నేనిక్" ౨౫౪
ఆ॥ అనుచునిట్లుపల్కి యం దీల్గిపడియున్న బాలు మతియు నాన్నపాలు విడిచి
మౌనిసప్తకము చమత్కారనగరంబు దారిఁబట్టిచనిరి యొక దత్తకాంబ, ౨౫౫
తే॥ తత్తిరస్క్రియమాణుఁడై ధరణిపాలుఁ డగ్గలంబుగనాదరించు నాగ్రహమున
వారివృత్తాంబునరయంగ వలయుననుచు మేడిపండులలోపలం బైడినింపి ౨౫౬
క॥ అక్కడనక్కడ వానిని నొక్కొక్కటి దారివెంట నుంపించుటయున్
మిక్కుటమగునాఁకలికిం జిక్కిచనెడిమునులు వానిఁ జేకొని రక్షిన్, ౨౫౭
క॥ బరువై యుండుటయునువవి యటిమితిగం బగులఁదీసి యందొక్కటితా
మెఱయుచు నందుండెడి కర్బురముం బొడఁగాంచి యత్రిముని యిట్లనియెన్,
క॥ "మునులార! మేడిపండులు కనకవినిర్మితములనుచు గ్రహియించుటకున్
మన మజ్ఞానులమా కా, మనయదు గృహమందుఁ గోర్కియాలే దరయన్, ౨౫౮
తే॥ సార్వభౌమనిరీహుల యిర్వురందు నగు నిరీహుఁడె యుత్తముం డరసిచూడ,
ధర్మకార్యంబుచేయంగఁ దలఁచిరేని శ్రీతిరుగు.

ఆ॥ బురదఁ గాలువెట్టి మరలఁ బ్రక్షాళన మాచరించుకొనుటకన్న మున్న
దానిఁ ద్రొక్కకుండ దప్పనుంటయే మేలుగూర్చునేఁత మిత్రులార! ౨౬౧
తే॥ అర్థముం గూడఁబెట్టనియట్టివాని నేయుపద్రవములుగూడ నెనయఁజాల,
వుర్వి సర్వార్థములుగల్గియున్న వారిలోన ననుపద్రవుం డొక్కఁడేని యున్నె, ౨౬౨
క॥ దారిద్ర్యము సామ్రాజ్యము ధీరులు తులలోననుంచి తిన్నగఁ దూఁపన్
దారిద్ర్యమె భారంబై తీరునటంచనుచు నాతుధీని దలంతున్" ౨౬౩
వ॥ అనినవిని కశ్యపుండిట్లనియె,
క॥ "అర్థపరిగ్రహమెన్న ననర్థపరిగ్రహముకొఱకె యత్రిమునీంద్రా!
అర్థమదాంధుఁడు తుదిపురుషార్థంబుం బొందఁజాల కలజడిగుడుచున్, ౨౬౪
తే॥ అర్థవంతుల నతిమోహ మావరించు, మోహబంధంబు దుర్గతిమూలమగును,
గాన నర్థంబు దూరంబుగం ద్యజించి మనుటయొప్పును మోక్షార్థిమానవునకు, ౨౬౫
క॥ ఏధర్మం బర్థంబున సాధింపంబడునో యద్దిక్షయమందును దా,
నేధర్మంబు తపంబున సాధితమగు నదియె మోక్షసాధన మవనిన్" ౨౬౬

వ॥ అనినవిని భరద్వాజుండిట్లనియె, ౨౯౮

ఆ॥ "ముదుకఁడయినమీఁద ముదియును వెంట్రుకల్, ముదియుు దంతములును, ముదియుఁ గనులు,
ముదియుఁ జెవులు గాని మునుపటికంటెను వయసుదగును దృష్ణ వదలకతని, ౨౯౯

తే॥ సూదితోడను వలువపై నూచపుందు దారములఁ ద్రిప్పుచాడ్పునఁ దాఁ బరాత్మ
త్రిప్పు సంసారసూత్రముం దృష్ణయనెడి సూదితోడఁ బ్రపంచమన్ చోళమందు,

కం॥ అంగము పెరిఁగిన కొలఁదిని శృంగంబులు పెరుఁగురీతి క్షితిఁ దృష్ణయుఁ దెం
పుంగాంచుచుండుఁ గ్రిమముగ వెంగలులకుఁ బెంపుగాంచు విత్తముతోడన్, ౩౦౧

ఆ॥ అంతులేదుతృష్ణ, కలిదుఃఖకారిణి, దాని తుదియెఱుంగఁ దరముకాదు,
కర మధర్మబహుళ, గావున నద్దానిఁ దోసిపుచ్చవలయు దూరమునకు" ౩౦౨

వ॥ గౌతముండిట్లనియె

కం॥ "తుష్టిం బొందనిమానవుఁ డిష్టంబులఁ బడయజాల కింద్రియలౌల్యా
విష్టుండగుచును బహువిధకష్టంబుల ననుభవింపఁగలఁ డెన్నటికిన్, ౩౦౪

కం॥ సంతుష్టుండగుచును జూవ కంగ్రకటసంపదలె యొడఁగూడుచును నుమాన
ద్వంతుఁడగువాని కిభువియుంటఁడుఁ జర్మావృతముగ నగుపదంభంగిన్ ౩౦౫

కం॥ సంతోషవార్ధిమగ్నులు శాంతాత్ములునైనయట్టి జనులకుఁ గల య
త్యంతసుఖమెక్కడిది ధనవంతుల కందిందుఁబెట్టు పనిగులుదప్పన్, ౩౦౬

కం॥ సంతోషాభావము వ్యథ, సంతోషము పరమసుఖము జనులకుఁ గానన్
సంతుష్టులయి సుఖార్థులు సంతతము వసింపుటొప్పు సంయములారా!" ౩౦౭

వ॥ విశ్వామిత్రుండిట్లనియె, ౩౦౮

కం॥ "కోరినకోరికదీరుడు వేఱొకడు సముద్భవించు వెంటనె, సర్వ
ధారం గృశానుఁడుంబలెఁ గోరిక లభివృద్ధినొందు గోరినకొలఁదిన్, ౩౦౯

ఆ॥ మోహమునను గామములఁగోరుచునుజుండు పడయుఁ డెన్నటికిని బరమసుఖము
శ్రేయమధివసించు చెట్టునకుంగ్రింద మనెడి కముజుపిట్టమాడ్కిఁ దాను, ౩౧౦

తే॥ అనుదినం బబ్ధిపర్యంతగాత్రిలోర్వి ననుభవించెడి యస్మహాజనునకంటె
నగుఁ గృతార్థుఁడు కనకంబు నశ్మమును సమానముగఁ జూచునట్టి సామాన్యజనుఁడె,

తే॥ ఏద్విజాధముఁ డర్థంబు నైనయదిమీఁదఁ జింతపడఁదగు వాఁడయ్యు సంతసిల్లు
నాద్విజాధముఁ డపుతోభయత్వభావనమునఁ జూడఁడు వచ్చెడి నారకంబు, ౩౧౨



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవరాజసూయము.

( తిరుపతి వేంకటీయము )

చ॥ నగసుఁడు నాగభూషణుఁడు చారుతరాప్రతిమానగాత్ర భా
స్వరుఁ డురుగాన నాట్యముఖ సర్వకలానిలయుండు భూతివి
స్ఫురితుఁ డమేయుఁ డకుంఠ నిజబోధసుధామయుఁ డొప్పుచుండు శ్రీ
హరి పరిచింతనామృత సమర్పితనైజమనః ప్రచారుఁడై॥ ౧

మ॥ అనుసంధ్యమ్మును నాతఁ డాడు సుమనోహస్తధ్వనుల్ వెల్లుగాఁ
దనకున్ భృంగిముఖుల్ సహాయులుగ సాంద్రంబైన యానందమున్
గనువారల్ భజియింప నాత్మతను భాగస్థాయిసర్వప్రజం
బును గీతామృతసారసంపదలచేఁ బోషించి రక్షించుచున్॥ ౨

ఉ॥ ఆతఁడు నాట్యమాడు సమయమ్మున [illegible] ప్ర
ఖ్యాతులు మౌనితల్లజులు గణ్యులు సిద్ధులు సాధ్యులప్సర
శ్శీతకరాననల్ మొదలు; సేవకు నట్లరుదెంచు వారిసం
ప్రీతమనస్కులన్ సలుప శ్రీహరిఁ బాడుచు నాతఁడాడుచున్॥ 3

ఉ॥ అశ్వపుధాటియో? జలధరార్భటియో? యనుభంగి భృంగి వి
శ్వేశ్వరుఁ "డౌను? మే?" లనుచు నెంతయు మెచ్చ మృదంగమూని తా
విశ్వవిచిత్రవాద్యమున వేడ్కఁ ఘటింపఁగ నాగభూషణుం
డీశ్వరుఁ డాడి పాడునఁటు? యేరలసాటి నుతింపనేర్తురో॥ ౪

తే॥ గీ॥ ఇట్టు లనుసంధ్యమును నాట్యమెలమి సలిపి
ముక్తి ప్రీత్యర్థ మొనరించు మూర్తియౌట
నితర దైవతములకన్న నితని నెల్ల
సుమనసులువచ్చి సేవింపఁ జూచుచుండ్రి॥ ౫

చ॥ జరిగె ననంతకాలమిటు స్వాదుతరాప్రతిమానగానమా
ధురియును దాండవంబు గడుఁదోరముగాఁ గనువారి మానసాం

తరముల నాటికిఁ; నతని తత్త్వ మెఱుంగవి వారుగూడ న
త్తురు కనిపోదురందుఁ దటితో సతేఁడాడుచుఁ బాడుచుండఁగన్ ॥ ౬

వ॥ అమ్మహాదేవుం డిట్లనుసంధ్యంబును శ్రీహరి భక్తితత్పర
త్వమ్మునఁ దన విద్యాతిశయమ్ము సఫలమ్మొనర్చుచుఁ దాండవానంత
రమ్మున నొకట సభాస్తారులం గాంచి యిట్లనియె॥ ౭

శా॥ ఈసిందోలగమాలికిం వినుత మే నిష్ఠాదువాక్యమ్ములు
త్థానైకాదశి వచ్చుచున్నది హరిన్ దత్కాలమందర్చనా
ధీనుల్ జేసినవారలన్నిరతముల్ దివ్యస్మహావైభవా
నూనాయుత్రిశరత్సౌఖ్యములు చెందుర్ డిందుసర్వాఘముల్ ॥ ౮

శా॥ ఇందన్ కేశయనించియున్న హరి నాఁడీక్షించు నందమ్ములా
కందమ్ములిక్వికసింపఁజేసి జగమాకంపాత్తునా వేళ నా
నందమ్ముప్పతిలన్ యజింపుటదిసం ధానించుఁ బున్నెంపుఁది
న్నెం డై వారెఁగఁజాలు భాగ్యము నమంగీభూత సామ్రాజ్యముల్ ॥ ౯

క॥ [illegible] వసనున
నలఘున్ లక్ష్మీసనాథు హరిదినమునఁ బూ
జలు కార్తికమునఁ జేసెడి
సలలితమతిశాలికిఁ గల్గు సౌఖ్యము కొదవే॥ ౧౦

శా॥ నేనేమో? "పరతత్త్వమంచు మదిలోనిక్కమ్ము మీరెల్లరున్
ధ్యానింత్రిమహానియు నేఁ గొలుతు నిత్యమ్మున్ మహాభాగుఁడా
శ్రీనాథుండు మదీయ నాట్యకలనా సేవ్యం బెఱుంగుండు వి
జ్ఞానాంభోనిధియాతఁ; డాతనికి నిచ్చల్ పూజసేయందగున్॥ ౧౧

మ॥ ప్రతిసంవత్సరకార్తికమ్మునను దత్పాదాంబుజమ్ముల్ సుమ
ప్రతతిన్నేయజియింతుఁగాని "యిటుసల్పంబోలు" నంచున్ భవ
న్మతికిక్కన్ వచియింపలేదెపుడు నమ్మానింపుఁడీయేఁడు స
త్కృతులన్ శ్రీహరినుత్సవాదులఁగడున్ దేదీప్యమానమ్ముగన్"॥

వ॥ నావుడుఁ బరమభక్తులగు సభాసదులు కరమ్ములు మొగిచి
యిట్లనిరి. స్వామీ? యేము మీయందుం బలె శ్రీహరియందును భక్తి

లమృత దారాధనమ్మునకై యింతనొక్క సెలవీయంబని లేద, తప్పక
యట్ల యొనరించెదము, కాని కొండొక విజ్ఞాప్యంబుగల దయ్యది యా
లింపం బ్రార్థించెదము. కార్తికైకాదశినాఁడు స్వామి మేల్కొందు
రనిక దా? సెలవిచ్చితిరి; నాఁడే దినమ్మున నెచట శయనించియుండెనది
యు, నా శయనమ్మునకుఁ గతమ్మును వచించి మా మనమ్ములు నిస్సంశ
యమ్ములొనర్పవలయు నాఁగ నాగభూషణుండిట్లను॥ ౧౩

క॥ విను మాషాఢైకాదశి
ననఘుఁడతఁడు బోధమూర్తి యహితల్పమునన్
వననిధి నియోగ నిద్రన్
గొని విద్యాస్ఫూర్తి నెఱయఁ గొను గారుఁ జూడీ॥ ౧౪

క॥ కార్తిక శుద్ధైకాదశి
నార్తిహరుం డతఁడు త్రిభువనావన దీక్షన్
స్ఫూర్తిన్ మేల్కొను సువ్రత
వర్తుల కానాఁడు మిగులఁ బావనమరయన్॥ ౧౫

ఉ॥ కావున నాఁటి పూజ త్రిజగమ్ములకే నెఱిఁగింప నెంచి స
ద్భావులరైన మీకడ ముదమ్మున నేఁడు వచించితిన్ మహా
ధీవిభవుండు శ్రీకరుఁడు దివ్యమహానుహితుండు మీదు సం
భావన కర్హుఁడే నెఱుఁగువట్టును జెప్పితి సల్లొనర్పుఁడీ॥ ౧౬

చ॥ అనవుడుఁ దత్సభాసదులు హస్తము లెత్తిరి యెల్ల వారు మే
లనిరి "సెబాస్సెబా" సనుచు నాడిరి పాడిరి యేమిచెప్ప నా
ఘనుల హాళాహళుల్; పిదపఁ గాలగళుండల వారి శ్రద్ధకున్
మనమున మెచ్చుచున్ మరల మాటయెదో వినఁబడ్డయట్టులై॥ ౧౭

మ॥ "ఎవఁడా బుస్సలుకొట్టువాఁ డతఁడని తానెల్లన్ విలోకించి యం
దెవఁడున్ గానఁగ రాని జిచ్చువడి మోమే మాత్రిమో వంచున
ట్టవలోకించె నిజాంగ సంగతు నహీన్ బ్రారబ్ధకోపానల
స్థవిరాస్యున్ నయనాంతరుద్గళదసుందస్ఫార దావానలున్॥ ౧౮

క॥ అప్పగిదినున్న యంగవ్రు
సర్పమ్ముఁ గాంచిహరుఁడు జూడ్కు పరీతం
బిప్పామాహరిపూజకు
నొప్పనిగతిదోఁచుచున్న దూషింపంగన్॥ ౧౯

వ॥ అని యద్దానితో నిట్లనియె॥

క॥ ఉమ్మలికమిట్టులో నా
గమ్మా? నీకేలకలిగెఁగడుకో జెడు బల్
చెమ్మటలుగ్రమ్మ సారెకు
"హుఁ,, మ్మని బుసగొట్టెదేటికో చెప్పవమా॥ ౨౦

శా॥ ఆనాగమ్మిటు చెప్పఁగాఁదొడఁగె దేవా? శ్రీహరిన్ మీరు పూ
జా నైవేద్యమహోత్సవాదుల నయోగ్యత్వమ్మునన్ యాజింపంగను
త్థానైకాదశివచ్చుచున్నదనుచున్ దద్దక్ప్రబసఁగించు నా
యీనాదుర్విపినంబునందొదవె నేఁతే నాడు శీర్షమ్మునన్॥ ౨౧

ఉ॥ ఏమనుకొందు రేని యతిఁడెంతయుఁ బూజ్యుఁడెయౌనుగాక వి
ద్యామహనీయు లెల్లరును సర్పితుఁగాను నరింతురుగాక మా
కామయసంనిధాతయతఁడౌఁగాతన్ హరిపూజకొప్పఁగా
బోము భవత్సమీపమునఁ బొచ్చెము మానివచింతు నింతయున్॥ ౨౨

క॥ హరి నాగభూషణులకున్
బరస్పరము మైత్రియునియు బాగుగనాయం
తరమెఱుఁగుదైన మాకా
హరిసైఁపఁడు కాళియాహి నడఁచినతనన్॥ ౨౩

శా॥ మా చుట్టంబగు కాళియాహిశిరమున్ మర్దించుటే కాక నా
ట్యాచార్యత్వమదెల్లనయ్యెడలనే వ్యాపింపఁగాఁజేసి "పో
నీచా? యీయమునానదిన్ విడిచి భ్రమింతున్ జుమీ? యెన్నఁడే
నీచెంతన్ గనరాకుమీ?" యనునె? మమ్మెనింగ నంబోలదే॥ ౨౪

ఆ॥ వె॥ బురదతో స్నానటనటు సరిపోయెఁగాని
మాయురగజాతినింకొక్క మహిమఁ జేసి

పాదతాడనములనట్లుపడియు శీర్ష
మెత్తిబ్రిదుకునె? యటుమీఁద నేమియైన॥ ౨౫

చ॥ అతని శిరమ్ముపైని హరియంఘ్రులు నిల్చి నటించెఁగానిప
ద్ధతి యదిమాకునెల్లరకు నాతనికింబలె సంఘటించె శీ
ర్షతలము మోఁదుమాకు దుర్భరమ్ముగఁ దత్పదయుగ్మమెట్లుము
ద్రితమగు నొప్పుచున్నదియొ తెల్లము నాగులకెల్ల నల్లఁగన్॥

చ॥ అనవుడు నాగభూషణుని కక్షగనుండిన సూర్యుఁడెంతయున్
గనలియు లోనడంచుకొని క్రమవచో విభవంబెలర్ప ని
ట్లను నిదిగొప్పతప్పనుమి? యీహరిమీకాలమందొకానొకం
డనఁదగువానికిన్ సలుపు నాయకకారమిటున్ గణించుటల్॥ ౨౭

చ॥ ఎవనికిఁగాని యెన్నఁడును నెవ్వఁడు సత్కృతి సేయకుండు వాఁ
డవని వినంబడండ, యప్పుడప్పుడటుల్ ఘటియించువాని క
ట్లవమతిపొందొనర్చుటకునై హలుపోసవేసుండితీరు వా
యవమతిజాతికంతకును నబ్బినయట్లు [illegible]॥ ౨౮

క॥ అధికారణముగఁ బుణ్యా
స్పదమగు సత్కృతికి నడ్డుసల్పి స్పర్ధాదు
ర్మదము వెలార్చుట తగునే?
సదగ్రణులు వెల్చునట్టి సదములయందున్॥ ౨౯

క॥ ఇప్పగిది హరుని యంగపు
సర్పమ్మును మందలించె సత్సేవ్యుండై
యొప్పారు సూర్యుఁడింకొక
సర్పము తలయెత్తి అంతు సలుపకయుండన్॥ ౩౦

మ॥ హరుఁడాశ్చర్యపరీతుఁడై మనమునం "దాశౌర? యేపాటిదీ
యురగంపుంబురువట్టి శ్రీహరికిరీటోద్దేశికైయొంతగా
నటవన్ సాహసమెట్లుగల్గు? నిటసాహాయ్యంబు వేఱొక్కఁ డెం
పరిలోలోనొనరించి దీనికిటుజల్పాకత్వమున్ గూర్చెడిన్॥ ౩౧

ఉ॥ అట్టి ప్రబుద్ధుఁ డిం దెవఁ డటంచుఁ గనుంగొన వీరభద్రుమో
మట్టికళంకమున్ దెలుపునట్టిదియై కనుపట్టె శూలియు
ప్పట్టున దివ్యదృష్టిఁ గని భద్రుఁడ దే మొదలంతరంగమున్
బెట్టఁడు విష్ణుపైఁ; మిగులద్వేషము చూపఁగఁడంగు నిచ్చలున్ ॥ ౩౨
ఉ॥ దక్షుని దుర్మదాంధ్యము వదల్పఁగ వీఁ డొక స్వేదజంబుగా
నాక్షణమందు నాహృదయమందలి తీవ్రతఁ బట్టి పుట్టెఁద
చ్ఛిక్షకుఁ డేగి యయ్యెడల శిష్టులఁ గూడఁ బరాభవించెఁ బ
ద్మాక్షునిఁ గూడ వీఁడు చటసింహుకయున్ గణియింపఁడక్కటా ॥ ౩౩
ఉ॥ ఆతఁడు నన్నుఁ జూచి కపురగ్గలపున్ రుషనాఁగి వీని దు
ర్నీతికి నైఁ చెనా సయిచు నేరుపు వీఁడొకుఁ గండుబొత్తిగాఁ
గాతరుఁడాతఁడంచు మదిఁ గన్గొని తన్మహిమానుభావ వి
ఖ్యాతులు లెక్కఁబెట్టక నికార మొనర్పఁగ నెంచు మూర్ఖతన్ ॥ ౩౪
తే॥ గీ॥ ఈయనాత్మజ్ఞుఁ డెప్పుడో యీపరీ స్ప
ంకుఁ జేసె దు
ఆవిననుం గూడ లెక్కింపకిందునొకని
బైకిలేపి ప్రేలించు దుర్భ్యాషణములు ॥ ౩౫
ఉ॥ ఏనఁట? చెప్పువాఁడనఁట? యెల్లజగమ్ముల నేలు శ్రీహరిన్
ధ్యాన మొనర్పఁడంచది సదస్సఖిలమ్ము నటున్ హితంబఁట
ద్దానికి నన్మదాగమున దాల్చిన నాగ మొకండు వారకం
బౌనఁట? యింతకన్నఁ గలదా? యిల దారుణసాహసంబహా ॥
తే॥ గీ॥ వీరభద్రుండొకించుక ప్రేరణంబు
చేసె నేయన్న హరిపయినీసుకతన
నంతమాత్రన నామాటకడ్డు చెప్పఁ
దలఁచు పాటిదె యీహాలాహలపుఁ బురువు ॥ ౩౬
చ॥ అనితసయుంశమై హరికి నర్చలొనర్చి తదీయతత్త్వమె
ల్ల నెఱిఁగి దీర్ఘజీవియగులాగున దీవనగాంచి హాల్చు నా
హానుమయుగానమున్ వినఁగ నయ్యెడనుండుట లెంగి చెప్పమో

ఋనఘ? హరింగురించిమనయజ్ఞుల తిక్కలడంగుమచ్చుటల్॥ ౩౮
మ॥ హనుమంతుండది యాలకించి వినుఁడయ్యా? సర్పరాజుల్ మహా
ఘనుఁడాతండొకనాఁడు మున్నతనిమీఁద గట్టన్ బ్రయత్నించి వం
చినకిన్కన్ దనుజేంద్రపుత్రకుఁడొగిన్ శ్రీరేపఁగా మూఁగివి
చ్చినదిన్ జచ్చినదిన్ సమస్తమును నేఁజెంతన్ విలోకించితిన్॥ ౩౯
ఉ॥ అంగన "సర్పజాతిశయినాహరికిన్ గన" లంచుమీరు మీ
స్వాంతములన్ దలంచుటది చాలప్రమాద; మెవండుగాని దు
శ్చింతతనొడ్లకున్ జెఱుపుచేసెడి జంతువులన్ సహింపఁడే
మంతులెఱుంగకుండిన యమాయికులన్ వధియింపఁ డెన్నఁడున్॥
శా॥ మీలోనుత్తములెందఱో కలరు నెమ్మిన్ వారిఁబూజింపరే?
పూలుంబత్తిరిగూర్చి లోకము; జగంబున్ దుఃఖింపఁగాఁజేయుదు
శ్శీలమ్ముంగలవారినో? లగుడముల్ చేఁబూని మర్దింపఁగా
నాలోచించుచునుందురెవ్వరయిని బామాశాలగోపాలముల్॥ ౪౦
క॥ కావున గోపాలుండటు
మీ వానిన్ గాళియున్ క్షమింపమితప్పే?
యావిష్ణువు దుష్టులనిం
కేవారిన్ సైఁచె మీరలెఱుఁగరె? నాగుల్॥ ౪౧
తే॥ గీ॥ శిష్టరక్షణమును దుష్టశిక్షణంబు
నతని కృత్యమ్ములగుట మీయందెకాదు
ఎవరియందేని దుష్టులనేరి శిక్ష
సేయుశిష్టులనెలమిఁగైసేసి ప్రోచు॥ ౪౨
ఉ॥ "వాలినిజంపె నాతఁ"డని వాలముగల్గిన యస్మదాదులా
శ్రీలలనామనోహరుసేవను దూఱుటలేదు, వాలి దు
శ్శీలము వాలిజీవము నశింపఁగఁజేసెనెకాని యాతనిన్
గూళతనాన రాఘవుఁడుగూల్పఁడు ప్రాజ్ఞులు మీరెఱుంగరే?॥ ౪౩
శా॥ మీజాతిన్ గడుఁబ్రాజ్ఞులెందఱో మహామేరుప్రకాశుల్ గలా
రోజన్ వ్యాకరణంపు భాష్యమునెవండో కాదు మీచుట్టమే

రాజద్రోహిగ సహస్రవాగ్లహరిపర్వన్ జేసి నిర్మించె మీ
యీజాడ్యవ్యాప్తిఁ దాలకించునెడ "హీం?హీం?" యంచు గర్హింపఁడె.

ఉ॥ ప్రాజ్ఞత లేనివాండ్రు రకప్రాజ్ఞులు వ్రాలెఁ దలల్ గదల్చుచున్
విజ్ఞులు సెప్పు వాక్యములు వేగిరపాటున నవ్వుచుందు ర
ల్పజ్ఞత కిద్దియే గుఱుతు భావిసమస్తమెఱుంగు నట్టి స
ర్వజ్ఞుని మాట "కా" దనఁగవచ్చునె? యించుక జ్ఞానమున్నచో॥ ౪౫

తే॥గీ॥ జ్ఞానలవదుర్విదగ్ధతాధీనులైన
మిమ్మువంటి యల్పజ్ఞులహమ్మువూని
సల్పు దుష్కార్యములఁ జేసి జాతికెల్ల
వచ్చు నయశంబు ప్రాజ్ఞులవలనఁ బోదు॥ ౪౬

మ॥ హరిమీలో నెవఁడో యొకానొకని మాద్యచ్ఛిద్రు మర్దించి మేల్
తెరువుం జూపిన యంతమాత్రమున ద్వేషించి దూషింతురే?
సరి? లేఁడింతయు మీభుజంగ ... తాఁ జర్చింపలేఁ డొక్కొ? త
... గణమ్ముల్ భజియించు మీచ్చలును వచ్చయ్యాకృతిన్ బొందుచున్
... జంగ రొట్టునకు నంతరముండదె? మీకునుంత; మీ
యుల్లములందుఁ జూచికొనుఁడూరక శ్రీహరిపై నవాచ్యపుం
బ్రల్లదముల్ లిఖింపకుఁడు భావభవారివచించు చొప్ప సం
ధిల్లు ముదమ్ముతో వినుఁడు ధృష్టతమానుఁడు పూనుఁడీ నుడుల్॥ ౪౭

ఉ॥ నావుడు మున్ను లేచు నలనాగమిటుల్ వచియించె జాతిలో
నేవగ నెవ్వఁడో యొకని కెవ్వఁడొ తానపకారిగాఁ బరీ
భావము తక్కువారలకు బట్టవటంటివి మున్నొకండు భూ
దేవుఁడు నీవు సల్పు నుపదేశమెఱుంగక మున్ను మోఁదఁడే॥ ౪౮

శా॥ ఏదో కొండొక నాగమాతని సతిన్ హింసింపఁగా జచ్చియా
మీఁదన్ దత్సతి చల్లగా బ్రతికె నామే లేనిఁ జింతింపకా
భూదేవుండు వధింపఁగాఁ దొడఁగె మమ్ముం బోట్లనెల్లన్ బోరిన్
వేదాంగమ్ములు వేదముల్ సదివి యవ్విప్రుండు సప్రాజ్ఞుఁడే॥ ౫౦

ఆంధ్రీకృతములగు నాగ్రంథములలోని యత్కించిద్విషయముల
తీంగి వానిని దమభాషలోనికి మార్చుకొని యుపన్యసించుటచేతనే
వానికిలోఁబడి మనవారలు కొందఱు భ్రాంతులగుచున్నారు. ఈలాటి
భ్రాంతికి జన్మాంతరీయకర్మవిశేషమే హేతువైనది. కాన విదేశీయవా
గాడంబరములనుబట్టి వర్ణనిర్ణయము చేసికొనఁగూడదు. మతధర్మశా
స్త్రములప్రకారము మనవర్ణమును విమర్శచేసికొనఁదగినది. అధర్మశా
స్త్రములు మొదటనే నిరూపించియున్నాముగాన వర్ణభేదములు సృష్ట్యా
దిగా నేర్పడినవని నమ్మఁదగినది. ఛాందోగ్యోపనిషత్తునందుఁ గులము తె
లియని జాబాలికి గౌతమమహర్షి యుపనయనాదిసంస్కారములుచే
యించెనని యున్నదఁట. అందువలనఁ గులగోత్రములు లేనివారైనను
బ్రాహ్మణజాతివారు గావచ్చునని కొందఱు పండితంమన్యులు చెప్పుకొ
నుచున్నారు. ఇది కేవల మవిచారమూలకమైనది. జాబాలి కులగోత్రము
లు లేనివాఁడని కాని సంకరజాతియని కాని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుట
దు. జాబాలియగు సత్యకామునకుఁ జిన్నతనమునందె తండ్రిచచ్చు
ను పనయననిమిత్తమై పెద్దలవద్దకుఁబోవుటకు నిశ్చయించి తనగో
త్ర తెలిసికొనుటకుఁగాను దల్లివద్దకుఁబోయి గోత్రము చెప్పుమనఁగా
౨ తనభర్తయొక్కగోత్ర మెఱుఁగనందుకుఁ గారణము చెప్పినది.
॥ నాహం తద్వేద తాత యద్గోత్రస్త్వమసి, బహ్వహం చరంతీ పరిచ
రిణీ యౌవనే త్వామలభే, సాహ మేతన్న వేద యద్గోత్రస్త్వమసి
జబాలాతు నామాహమస్మి సత్యకామో నామ త్వమసి సత్యకామ ఏవ
జాబాలో బ్రువీథా ఇతి. అనఁగా నీ వేగోత్రముకలవాఁడవో నాకుఁ దెలి
యదు. ఎందువల్లననఁగా నేను భర్తృగృహమం దతిథ్యభ్యాగతి
మొదలుగాఁగల యనేకుల కుపచారములఁ జేయుచు గృహకృత్య
ములయందుఁగల యాసక్తిచే గోత్రవిచారణ యెన్నఁడును జేసిన
దానఁగాను. యౌవనకాలమందు నిన్నుఁ బొందితిని. ని న్నెవర
న నడిగినయెడల జబాలాపుత్రుఁడను సత్యకాముఁడనని చెప్పుమని

యీశ్రుతియర్థము. దీనివలన సత్యకాముఁడు సద్గోత్రజుఁడగుటకు
దియము లేదు. ఆయనతల్లికి మాత్రము గోత్రము తెలియదు. గృ
కృత్యములయందుండుట స్త్రీల కావశ్యకమైనది. వారికిగోత్రములు
మొదలగువానితోఁ బనిలేదు. అందువలన జబాలకు గోత్రము తెలియ
లేదు. అంతేకాని కులగోత్రములు లేని స్త్రీ కాదు. గోత్రము తెలియక
పోయినను దనపేరు చెప్పినమాత్రముననే పెద్దలు విశ్వసింతురను సభి
ప్రాయముతో జాబాలియని చెప్పుమని చెప్పినది. ఇందువలన నామె
మహాపతివ్రతయనియుఁ జాలఁ బ్రసిద్ధురాలనియుఁ దెలియుచున్నది.
శంకరభగవత్పాదాచార్యులవారుకూడ నీయుపనిషత్తు భాష్యమందు
జబాల చాలయోగ్యురాలని వ్రాసియున్నారు. భా॥ బహు భర్తృ
గృహే పరిచర్యాజాతం అతిథ్యభ్యాగతాదిచరంతీ అహం పరిచరిణీ
పరిచరంతీతి పరిచరణశీలైవాహం పరిచరణచిత్తతయా గోత్రాది స్మరణే
మమమనో నాభూత్, యౌవనేచ తత్కాలే త్వామలభే లబ్ధవత్యస్మి
దీనివలన జబాల యెల్లప్పుడుఁ బెద్దలకుఁ బరిచర్యచేయుచు భర్త
కు యాజ్ఞానుసారముగ వర్తిలుచుండుటవలన గోత్రము మఱచిపో
నదనియు నామె సత్స్వభావముగలదియనియుఁ దెలియుచున్న
సత్యకాముండు కులగోత్రములు లేనివాఁడు కాఁడు. సద్వంశస
తుఁడగు బ్రాహ్మణుఁడని నమ్మఁదగినది. పండితంమన్యులు జా
దృష్టాంతముచే నందఱును బ్రాహ్మణులుగావచ్చుననుట భ్రాంతిజన్య
ముగాని యథార్థముకాదు. క్షత్రియులగు విశ్వామిత్రాదులు బ్రాహ్మ
ణులైయున్నారుగావున నటులనే యందఱును బ్రాహ్మణులుగావచ్చు
ననుటయు మంచిదిగాదు. విశ్వామిత్రుఁడు బ్రహ్మఋషియైనది యథా
ర్థమేకాని యాదృష్టాంతముచే నందఱును నగుటకు వీలులేదు.

విశ్వామిత్రుఁడు తన తపోమహిమచే దేవుని మెప్పించి తనకు
విరోధియగు వసిష్ఠు నిష్టపఱచి బ్రాహ్మణుఁడయి యున్నాఁడు. త
న్నను దేవునియాజ్ఞయు లేకుండఁ దనయంతటఁదానే బ్రాహ్మణు

లేదు. భారతాదులందు బ్రాహ్మణులైనట్లుగా వ్రాయఁబడిన క్షత్రియులందఱును నీవిశ్వామిత్రుని రీతిగాఁగాని లేక జన్మాంతరమందే బ్రాహ్మణత్వమునకుఁ దగిన కర్మము చేసికొనికాని యుందురు. కాని నిర్నిమిత్తముగా వేదాధ్యయనాదులు చేయుట మాత్రముచేతనే బ్రాహ్మణత్వము పొందినవారు కారు. ఈశ్వరాజ్ఞాదిరూప విశేషవిధి లేకనే బ్రాహ్మణత్వము వచ్చెడియెడల క్షత్రియవైశ్యజాతి లేకుండఁగానే యందఱును బ్రాహ్మణులే కాకుండిరి. మాంధాతృనలహరిశ్చంద్రసగరదశరథధర్మరాజాదులగు మహానీయులు సర్వవేదశాస్త్రసంపన్నులై బ్రహ్మవిచారముగలవారలై కొందఱు బ్రహ్మజ్ఞానముగూడ గలవారలై యున్నట్లు మన పురాణాదిగ్రంథములందుఁ గలదుకదా! వారలందఱు బ్రాహ్మణజాతి వారలైరా? బ్రాహ్మణులమని చెప్పుకొనిరా? లేదు. ఎంతవిజ్ఞులైనను క్షత్రియులమని చెప్పుకొని క్షత్రియజాతి కనుకూలమగు ధర్మపాలనమునే చేయుచుండిరి. క్షత్రియజాతికి లేని బ్రాహ్మణజాతిధర్మముల నాచరింపలేదు. మనపండితంమన్యులు చెప్పినరీతి బ్రాహ్మణత్వము వచ్చెడియెడల వార లేల క్షత్రియులుగా నుండిరి? వారు మనపండితంమన్యుల మాత్రము విజ్ఞులు కారా? అగుదురు కాని క్షత్రియకులమందుఁ బుట్టి విశేషవిధిగా నీశ్వరాజ్ఞఁ బొందకయే బ్రాహ్మణత్వము పొందుటకు వీలులేదనియు నటుల నీశ్వరాజ్ఞగలుగుట చాలఁ గష్టసాధ్యమను నభిప్రాయముతో స్వజాత్యుచితధర్మమునందుండి యిహపరశ్రేయస్సులను బొందిరి. ధర్మవిరుద్ధాచరణగలవారలు కాలేదు. అటులనే మనముగూడ విరుద్ధధర్మముల నాచరింపక మనకుఁ దగినధర్మము లాచరించి మనజాతియందు మనముండుట మంచిది.

పైనఁజెప్పఁబడిన యుత్తములందఱును సామాన్యముగా వేదాధ్యయనాది బ్రాహ్మణధర్మములు గలిగియు క్షత్రియజాతియందుఁ బుట్టుటచే నాజాతి నతిక్రమించినఁ బతితులమగుదుమను నభిప్రాయ

ముచే దాము జన్మించిన జాతియందు బద్ధశ్రద్ధులై యుండిరి కద వేదాధ్యయనము మొదలగు నేవిధమైన వైదికకర్మములయందు దనధి కారులగు శూద్రాదు లిట్టివి వేదాధ్యయనాదు లాచరించినంత మాత్రముచే బ్రాహ్మణులగుదురనుట కేవలాజ్ఞప్రలాపమని ప్రాజ్ఞు లెంచకమానరు. ద్వాపరయుగమున వ్యాసునకు శూద్రస్త్రీయం దుఁ బుట్టిన విదురుఁడు బ్రహ్మవేత్తయని భారతాది గ్రంథములవలన నెల్లరును దెలిసియుందురు కదా! ఆవిదురునికన్న విజ్ఞులగుశూద్రులు భూతభవిష్యత్కాలములం దెప్పుడును నుండరని నమ్మవచ్చును. అనఁగా విదురుఁడు చాలవిజ్ఞుఁడని యభిప్రాయము. అట్టివిదురుఁడు బ్రాహ్మణుఁడనని చెప్పకొనెనా? బ్రాహ్మణధర్మముల నాచరించెనా? మనపండితంమన్యులు చెప్పుమార్గమే యథార్థమైనయెడల విదురుఁ డేల బ్రాహ్మణుఁడని చెప్పఁబడకపోయెనో విచారింపుఁడు. భారతాది గ్రంథములం దెచ్చటనైనను వెదకిచూచిన విదురుఁడు బ్రాహ్మణుఁడని వ్రాయఁబడియుండలేదు కదా. అయితే శూద్రుఁడని వ్రాయఁబడియున్న దాయనిన నిజము. వ్రాయఁబడియున్నది చూడుఁడు. భారతము, ఉద్యోగపర్వాంతర్గత ప్రజాగరపర్వము. "శూద్రయోనా వహం జాతో నాతో౽న్య ద్వక్తుముత్సహే, కుమారస్యతుయాబుద్ధి ర్వేదతాం శాశ్వతీమహం, బ్రాహ్మీంహి యోనిమాపన్న స్సుగుహ్యమపి యోవదేత్, న తేన గర్హ్యో దేవానాం తస్మా దేతద్బ్రవీమి తే,, అశ్లోకములచే నేను శూద్రయోనియందుఁ బుట్టినవాఁడనుగాన దత్త్వము నీకుం జెప్పుటకుఁ దగను, బ్రాహ్మణయోని యందుఁ బుట్టినవాఁడు గోప్యార్థమును జెప్పవచ్చును, దేవతలుగూడ మెచ్చుదురని స్వయముగా విదురుఁడే చెప్పియున్నాఁడు.

ఇటుల నెందుకుఁ జెప్పవలసిన నొకసమయమందు ధృతరాష్ట్రుఁడు విదురునిఁగూర్చి నీవు సర్వముఁ దెలిసినవాఁడవుగాన నాకుఁ బరతత్త్వమును దెలుపుమనఁగా నవ్విదురుఁడు నీవు పరతత్త్వమును దెలిసి

గొనవలసియున్నయెడల బ్రహ్మజ్ఞుఁడగు సనాతనునిఁబిలిపించి నీకుఁ దెలుపునట్లుచేసెదనని చెప్పెను. అంతమీఁద ధృతరాష్ట్రుఁడు, శ్లో॥ కింత్వం న వేద తంభూయో యన్మేబ్రూయాత్సనాతనః; త్వమేవవిదుర బ్రూహి ప్రజ్ఞాశేషోస్తి చేత్తవ॥ ఇత్యాదిరీతిగా "నీవాతత్త్వము దెలియవా, తెలిసినయెడల నీవే చెప్పుము, సనాతనునితోఁబనియేమి" యనిశంకింపఁగా విదురుఁడు "నేనుశూద్రజాతివాఁడను, నీకుఁబరతత్త్వము తెలుపుటకు యోగ్యుఁడనుగాను, సనత్కుమారుఁడే చెప్పఁదగినవాఁడు, బ్రాహ్మణుఁడైనవాఁడే తరహస్యార్థమైనను జెప్పుటకధికారముగలవాఁడని" చెప్పియున్నాఁడు. యథార్థముగా విజ్ఞులైనమాత్రముచే శూద్రాదులుగూడ బ్రాహ్మణులలోఁ జేరఁదగినయెడల విదురుఁడిట్లు తేలఁజెప్పును? ఈభారతశ్లోకములఁ జన్మనిమిత్తముగ వారలు మనపండితంమన్యులు చెప్పు పోడిమాటలు కుయుక్తులు నమ్మదగునా? నమ్మదగాదు సామాన్యముగా జాతిభ్రష్టత్వము గలుగదు. జన్మము మొదలుకొని జాతి యాశ్రయించుకొనియుండును. నిరంకుశమైన తపోమహిమచే నిర్వికల్పకముగఁ జేసి విశేషవిధిగా నిర్విఘ్నము పొందినవార లాశరీరముంచే జాతిమార్పుగలిగి యుత్తమజాతికిఁబోయినను నెల్లరకు నాదృష్టాంతము చెప్పుట తప్పు. కొందఱు మహాఋష్యాదులు శూద్రాదులవలనఁ గన్యలయందుఁబుట్టి తపోమహిమచే గొప్పవారలగుదురు. పురాణములగు ఋషుల చరిత్రలు మనకు దృష్టాంతములుగావు. వారుచేయు వ్యాపారములన్నియు మనము చేయలేము. వారితపోమహిమచే సమస్తదోషములను బోఁగొట్టుకొనఁగలుగుదురు. వారికి దోషముసంభవింపదు. కనుకనే భాగవతమందు "తేజోవతాం నదోషాయ" యని శుకులవారు పరీక్షిన్మహారాజునకుఁ జెప్పియున్నారు. మను॥ శ్లో॥ దైవైరనుష్ఠితంయద్వ ఋషిభిర్యదనుష్ఠితం, నానుష్ఠేయం మనుష్యైస్తు యుక్తంకర్మ సమాచరేత్॥ ఈశ్లోకము దేవఋష్యాదుల యాచారము మనుష్యులుఁగూడదను, తమకు శాస్త్రవిహితకర్మము చేయఁదగినదని చెప్పుచున్నది.

ఇవియన్నియుఁగనిపెట్టి మనము జాతిధర్మముల మానఁగూడదు. అయితే, మనుస్మృతి, స్వాధ్యాయేన జపైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయా సుతైః మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః॥ ఈశ్లోకము స్వాధ్యాయజపహోమాదులచేతఁ బ్రతిశరీరము బ్రాహ్మణశరీరము చేయఁబడునని చెప్పుచున్నది. మఱియు, శ్లో॥ శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం, క్షత్రియాజ్జాతమేవంతు విద్యాద్వైశ్యాత్తథైవచ॥ అనుశ్లోకము శూద్రకులమందుఁబుట్టినవాఁడును మంచిగుణకర్మములుగలవాఁడైన యెడల బ్రాహ్మణక్షత్రియవైశ్యజాతులను బొందునని చెప్పుచున్నది. మఱియు, ఆపస్తంబధర్మసూత్రము "ధర్మచర్యయా జఘన్యోవర్ణః పూర్వంపూర్వం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ. అధర్మచర్యయా పూర్వోవర్ణో జఘన్యంజఘన్యంవర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ" అనుసూత్రములు సద్ధర్మాచరణచే నీచజాతివారు గొప్పజాతిని బొందుదురనియు నధర్మచర్యచేత సత్తమజాతివారు తక్కువజాతిని పొందుదురనియుఁ జెప్పుచున్నవి. మఱియు, భగవద్గీతలోని "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః" అను శ్లోకము గుణకర్మములనుబట్టి జాతివిభాగమేర్పడినదని చెప్పుచున్నది గాన నీజన్మమందే శూద్రాదులు బ్రాహ్మణజాతినిబొందుదురని చెప్పుట కిందు మామతానుకూలమనుటకు సందియమేమని పండితంమన్యులు ప్రశ్నించుచున్నారు. ఇది సరియైనది కాదు. "స్వాధ్యాయేన జపైర్హోమైః" అను మనుస్మృతిశ్లోకము స్వాధ్యాయజపాదులచేత శూద్రశరీరమైనను బ్రాహ్మణత్వజాతినిబొందునను నభిప్రాయము చూపుటలేదు. ద్విజుఁడై పుట్టినవాఁడు వైదికసంస్కారముగలవాఁడై స్వాధ్యాయజపహోమాదులచేతఁ దనశరీరమును బ్రహ్మప్రాప్తి కనుకూలమైనదానినిగాఁ జేయఁగలఁడని తెలుపుచున్నది. ఏలయనిన స్మృత్యాదులయందు ద్విజునకుమాత్రమే స్వాధ్యాయజపహోమాదులు చెప్పఁబడినవి. శూద్రునకు స్వాధ్యాయాదులు కూడవని చెప్పఁబడినదికదా. శాస్త్రరీతిని ద్విజత్వ

మునచ్చినతరువాతఁగదా స్వాధ్యాయజపాదులు చేయఁదగినది. ఈపండితంమన్యులు చెప్పిడిరీతిగా స్వాధ్యాయజపాదులుచేసి తేఁగదా బ్రాహ్మణత్వమువచ్చెడిది. ఇది యెటులుండునను. పిచ్చికుదిరినఁగాని పెండ్లికుదురదు పెండ్లికుదిరినఁగాని పిచ్చికుదురదను చందముగా బ్రాహ్మణుఁడైతే స్వాధ్యాయ జపాదులు స్వాధ్యాయ జపాదులుచేసితే బ్రాహ్మణుఁడగుట యని యన్యోన్యాశ్రయదోషము సంభవించుచున్నది. ఈపండితంమన్యులు తమగ్రంథములలో బ్రాహ్మణునకే స్వాధ్యాయాధ్యయనాధికారము గలదనికూడ వ్రాసికొనియున్నారు గాన వారుచెప్పినయర్థము సరియైనదికాదు. ద్విజుఁడు స్వాధ్యాయాధ్యయనాదులచే బ్రహ్మప్రాప్తియోగ్యత కనుకూలముగు శరీరము గలవాఁడనియే యర్థముచెప్పవలయును. పైశ్లోకవ్యాఖ్యానమందుఁగూడ నటులనే వ్రాయఁబడియున్నది చూడుఁడు. "బ్రాహ్మీ బ్రహ్మ ప్రాప్తి యోగ్యేయం తనుః తన్వవచ్ఛిన్న ఆత్మాక్రియతే కర్మసహకృత బ్రహ్మజ్ఞానేన మోక్షో నాప్తేః" ఇది కుల్లూకభట్టువారిచే వ్రాయఁబడినది. వారు ధర్మజ్ఞులగు మహానీయులని యెల్లరకు విదితమే వారు బ్రహ్మప్రాప్తి కనుకూలముగు శరీరముగలవాఁడగునని వ్రాసియున్నారు. ఈలాటి ప్రసిద్ధార్థములవదలి శ్రుతిస్మృత్యాది విరుద్ధమును దోషగ్రస్తమును నగు పండితంమన్యుల యర్థమును మన మెటుల గ్రహింపవచ్చును. "శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం" మను శ్లోకముగూడ నిజన్మములోనే శూద్రుఁడు బ్రాహ్మణుఁడుగను బ్రాహ్మణుఁడు శూద్రుఁడుగను గావచ్చునను నభిప్రాయము గలది కాదు. అటులఁజెప్పినయెడలఁ బ్రకరణవిరోధము సంభవించును. ఆశ్లోకమునకుఁ బైశ్లోకమునుఁ జూడుఁడు. శ్లో॥ శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతశ్శ్రేయసాచేత్ప్రజాయతే, అశ్రేయాం శ్రేయసీంజాతిం గచ్ఛత్యాసప్తమాద్యుగాత్ ॥ అనికలదు. అనఁగా శూద్రస్త్రీయందు బ్రాహ్మణునికిఁ బుట్టినస్త్రీ బ్రాహ్మణుని వివాహము చేసికొనుటయు దానికిఁబుట్టినస్త్రీ

యును దానికిఁ బుట్టినదియును నికృష్టక్రమముగా బ్రాహ్మణుఁడే వివాహమునా డునట్టి యేడవస్త్రీకిఁ బుట్టినవాఁడు బ్రాహ్మణజాతియగునని దీనియర్థము.

ఇట్టులనే బ్రాహ్మణుఁడు శూద్రస్త్రీని వివాహము చేసికొనుచుండు దానికిఁ బుట్టినవాఁడును వానికిఁ బుట్టినవాఁడును గ్రమముగా శూద్రస్త్రీల వివాహమాడిన నేడవవానికిఁ బుట్టినవాఁడు కేవలశూద్రుఁడగునను నభిప్రాయమును దెలుపుటకుఁగాను "శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం" అని చెప్పఁబడియున్నది. అంతేకాని శూద్రులందఱును బ్రాహ్మణులు కావచ్చునని కాని బ్రాహ్మణులందఱును శూద్రులు కావచ్చునని కాని యదభిప్రాయము కాదు. ఆపస్తంబధర్మసూత్రములయందలి "జాతిపరివృత్తౌ" అను దానికిఁగూడ నీశరీరమున జన్మాంతరమును బొందునప్పుడీ జన్మమునందున సత్కర్మమును జేసియు యొకఁడు తక్కువజాతివాఁ డుత్తమమగు బ్రాహ్మణజన్మము నొందుననియు నీశరీరమునందుఁ బాపకర్మముఁ జేసినవాఁ డీశరీరము పోఁగానే జన్మాంతరమందు నీచజాతిని బొందుననియు నభిప్రాయమునుగాని సత్కర్మాచరణాదులవలన నీజన్మమందే యుత్తమజాతిని బొందునను నభిప్రాయముగాదు. చాతుర్వర్ణ్యం మయా సృష్టమను గీతావాక్యముగూడ నీజన్మమందైన గుణకర్మములతోఁ గూడ నాయాజాతులు సృజింపఁబడినవని తెలుపుచున్నది. జనించినతర్వాత వారివారి గుణకర్మములను బట్టి జాతినిర్ణయము చేయఁబడుననుట శాస్త్రవిరుద్ధమును ననుభవవిరుద్ధమును. శాస్త్రములు జన్మమువలననే జాతి కలుగుననుటకుఁ జూపించియున్నాము. అనుభవముచేతనుగూడ జన్మాంతరమందు గుణకర్మములను బట్టి జాతివిభాగమేర్పడుననుట సరికాదు. అనాదిగా మనయార్యులందఱును జన్మములచేతనే జాతివిభాగానుభవము గలిగియున్నారు. ఈయనుభవము శాస్త్రానుకూలమైయున్నది. శాస్త్రానుకూలమైన యీయనుభవమును బరిత్యజించుట ధర్మముగాదు.

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.
2 రాజా వెల్లపురవల వెంకటరాఘవేంద్రరావు బహద్దూర్, జాగీరుదారుగారు, నవాబుపేట.
3 బాకరాజు పరాంకుశరావు దేశముఖుగారు, యాడవరం.

:O:

## ఈనెల సొమ్ము చెల్లించిన చందాదారులు.

1 పంచాగ్నుల సీతమాధవశాస్త్రిగారు పాఠశాలోపాధ్యాయులు, వంగోలు.
2 శుభ్రవీటి తిప్పాజోస్యులుగారు, యాదకి.
3 లంకా అంబయ్యశాస్త్రిగారు, అంబాపురం.
4 అక్కిరాజు లక్ష్మీనారాయణగారు, కరణం, గుత్తికొండ.
5 దివాన్‌బహదూరు ఎల్లేపెద్ది జానకిరామయ్యగారు, పెన్షన్ జడ్జి, బెజవాడ.
6 బుజ్జా పార్వతీశంగారు లోకల్ ఫండు ఓవర్‌సీరుకు, చీరాల.
7 చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు, గుడివాడ.
8 గడియారం వెంకటాచలశాస్త్రిగారు, ప్రొద్దుటూరు.
9 శంకరమంచి అన్నయ్యశాస్త్రిగారు, చినవోగిరాల.
10 ఇంద్రకంటి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కర్నూలు.
11 పాటిబండ వెంకటరమణయ్యగారు ప్లీడరు, బెజవాడ.
12 ధారా వెంకటసుబ్బయ్యగారు, గుండ్లకమ్మ లాకుసూపరింటెంటు.
13 దంటు లక్ష్మీకాంతరావుగారు, సుద్దపల్లి.

:O:

# అభినవసరస్వతి

## పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇదియొక మాసపత్రిక, ఇందు ప్రాచీన నవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును ప్రకటింపబడును. ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలికవ్యాసములవలనఁగలుగు నానందముగాక చందాదారులకు సం॥కు 2-8 అపూర్వగ్రంథము లలవడును. చందా సం॥కి రు 3.0.0

### మా కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | అళ్లియాచార్యవిజయము | ... | ... | 0 | 4 | 0 |
| 2 | కరిణికోద్ధారిణి [పూళ వీరభద్రకవి] | ... | ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము | ... | ... | 0 | 4 | 0 |
| 4 | కంసవధ నాటకము | ... | ... | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి [సింహాద్రి వెంకటాచార్యులు] | | ... | 0 | 4 | 0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతులు [సుమతిశతకమునకు సంస్కృతము] | | ... | 0 | 2 | 0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | ... | 0 | 2 | 0 |
| 9 | విగ్రహారాధనఖండనఖండనము | ... | ... | 0 | 4 | 0 |
| 10 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము [పత్రికాధిపతి] | | ... | 0 | 4 | 0 |
| 11 | సంగదోషము | ... | ... | 0 | 8 | 0 |
| 12 | వీరభాగవతము [ముగొండ వీరభద్రకవి] | | ... | 1 | 4 | 0 |
| 13 | పులిందావివాహము [పత్రికాధిపతి] | | ... | 0 | 4 | 0 |
| 14 | గురిగింజ, వత్సలనీతిశతకము | ... | ... | 0 | 2 | 0 |
| 15 | శివానందలహరి [తంగెడ రామకృష్ణకవి] | | ... | 0 | 4 | 0 |
| 16 | లక్ష్మీవిలాసము [రాయసము వెంకటపతి] | | ... | 0 | 4 | 0 |
| 17 | నర్సారావుపేట శతావధానము [తిరుపతివెంకటీయము] | | ... | 0 | 8 | 0 |
| 18 | పశ్యంపశ్యం | ,, | ... | 0 | 2 | 0 |
| 19 | పశ్యశబ్దవిచారము | ,, | ... | 0 | 2 | 0 |
| 20 | పురశ్చరణము | ,, | ... | 0 | 2 | 0 |
| 21 | శంతనురాజచరిత్ర | ... | .. | 0 | 14 | 0 |
| 22 | రజస్వలావివాహఖండనము | ... | ... | 0 | 8 | 0 |
| 23 | వర్ణవ్యవస్థ | ... | ... | 0 | 4 | 0 |
| 24 | స్వర్ణకారవ్యవహారము | ... | ... | 1 | 8 | 0 |
| 25 | శుద్ధాంధ్రహరిశ్చంద్రచరిత్రము | ... | ... | 0 | 10 | 0 |
| 26 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము | ... | ... | 0 | 1 | 0 |
| 27 | సూతసంహిత-ఆంధ్రము | ... | ... | 2 | 0 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము.

జానపాడు-పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా.